ఆగస్టు
1977
70

# సృజన



పరిటాలా రాములూ, నీకు లాల్ సలాములు
వృథాకాదు నీ మరణం! రేపటి సూర్యుని కిరణం

2 రూపాయలు



ఆధునిక సాహిత్య వేదిక

మాస పత్రిక

# 70

# పరిటాల శ్రీరాములు సంస్మరణ సంచిక

## ఆగస్టు 1977

---

ప్రజా సాహిత్యానికీ, సంస్కృతికీ, కళలకూ పునరంకితమవుతూ సృజన 25 నెలల తర్వాత మళ్ళీ మీ ముందుకొస్తున్నది. 21 నెలల ఎమర్జెన్సీ కాలంలో సృజన జెయిల్లో వున్నట్లే లెక్క. ఎందుకంటే సృజన ప్రాణమైన విరసం రచయితలు, నిర్వహించే 'సాహితీ మిత్రులు' దాదాపుగా అందరూ బందీలయ్యారు. సృజన సంపాదకురాలు, ప్రచురణకర్త ఎమర్జెన్సీ కాలమంతా 'రాజద్రోహ' నేరానికి బోనెక్కి ఎమర్జెన్సీ ఎత్తేసిన ఇంతకాలానికి రెండేళ్ళ జెయిలు శిక్షకు గురయి బెయిలుపై విడుదలయింది. ఈ పరిస్థితుల్లో మీ చేతుల్లో పెడుతున్న పత్రికను అర్థికంగా హార్దికంగా ఆదుకోవాల్సిన బాధ్యతను మీ మీదే వుంచుతున్నాం.

---

నిర్వహణ

"సాహితీమిత్రులు"

---

సంవత్సర చందా : **15** రూపాయలు

ఆరునెలల చందా : **8** రూపాయలు

ప్రత్యేక సంచిక : **2** రూపాయలు

---

# సృజన

ఆధునిక సాహిత్యవేదిక

ఆగస్టు 1977 మాస పత్రిక 70



———

# పరిటాల శ్రీరాములు - విరసం

తెలుగు దేశంలో ఎమర్జెన్సీ శ్రీకాకుళ రైతాంగ పోరాట కాలం ప్రారంభమైన నాడే ప్రారంభమయింది. శ్రీకాకుళం జిల్లా, గోదావరి లోయ ప్రాంతాలంతటా పోలీసు క్యాంపులను పెట్టి ప్రజలను భయభీతావహులను చేసి విప్లవ రాజకీయ కార్యకర్తలను నాయకులను పట్టుకుని 'ఎన్‌కౌంటర్ల' పేరుతో కాల్చివేసి వెంగళరావు ప్రభుత్వం ఎమర్జెన్సీ యీనాటికి నిరాటంకంగా కొనసాగిస్తున్నది. రచయితలూ, కళాకారులుకూడా యీ ప్రభుత్వ దౌర్జన్యం చవిచూడ కుండా తప్పిపోలేదు. సుబ్బారావు పాణిగ్రాహి, తామాడ చినబాబు, వెంపటాపు సత్యం యిటువంటి 'ఎన్‌కౌంటర్ల'లో కాల్చివేయబడిన కళాకారులే.

పెన్నుతోపాటు గన్ను పట్టిన సుబ్బారావు పాణిగ్రాహి అరుణ సంస్మరణతో ఆవిర్భవించిన విరసం కూడా ఏడేళ్లుగా వెంగళరావు సీతకళ్ళలో పరిపూర్ణంగా పడుతూనే వున్నారు. రచయితల యిళ్ళ సోదాలు, పుస్తక నిషేధాలు, అరెస్టులు, కుట్రకేసులు బనాయించబడుతూనే వున్నాయి. ఎమర్జెన్సీ పెట్టగానే పట్టుమని వంద యాభై సభ్యులు కూడా లేని ఈ సంస్థ రచయితలు నలభైమంది దాకా అరెస్టయ్యారంటే తన ప్రజాసాహిత్య ప్రచారం ద్వారా విరసం ఎంతగా ఇందిరా - వెంగళరావు ఫాసిస్టు పాలన పక్కలో బల్లెమైందో అర్థం చేసుకోవచ్చు. 'మీసా' నిర్బంధమే కాకుండా నెలల తరబడి పోలీసు స్టేషన్లలో చిత్రహింసలకు గురి అయిన విరసం సభ్యులు, కళాకారులు వున్నారు. వీటన్నిటికీ పరాకాష్ట పరిటాల శ్రీరాములు హత్య. ఎమర్జెన్సీ ప్రకటించడానికి కొద్దిరోజుల ముందుగానే విరసం కార్యవర్గ సభ్యుడు కా॥ పరిటాల శ్రీరాములు మరి ముగ్గురు అతని సహచరులను కొందరు భూస్వాముల కిరాయి గూండాలు కర్ణాటక, రాయలసీమ సరిహద్దుల్లో పరమ కిరాతకంగా కాల్చి చంపారు. పరిటాల శ్రీరాములు అనంతపురం జిల్లా ధర్మవరంలో రైతాంగ నాయకుడు. అనంతపురంలో చైతన్య సాహితి అనే సాహిత్య సంస్థను నెలకొల్పి క్రమంగా దాన్ని విరసంలో సంలీనం చేసి అనంతపురం ప్రాంతంలో విప్లవ సాహిత్య సాంస్కృతిక ప్రచారానికి పట్టుకొమ్మలా నిల్చిన వాడు. మృతవీరుడైన ఆ రచయిత అరుణారుణ స్మృతికి ఈ సంచికను అంకితం చేస్తున్నాం.

—వరవరరావు.

# స్వవిషయం

ఇరవై అయిదు నెలల తర్వాత పదేళ్ళు నడిచి ఆగిన సృజన మళ్ళీ మీ చేతుల్లో వున్నది. అందుకు మీ ఆదరణ, అభిమానాలే కారణం కాని తెలుగుదేశంలో విప్లవ పత్రికలు వెలువడే మామూలు పరిస్థితులు వెలువడినయ్ అని అర్థంగాదు. ప్రెస్ సెన్సార్‌షిప్ పోయింది. అభ్యంతరకర రచనల ప్రచురణ నిషేధచట్టం పోయింది. అవాళకాదు యిది పోయి నాలుగు నెలలయింది. ఎందుకు మరి ఎమర్జెన్సీ కన్నా ముందు ఆగిపోయిన ప్రజల పత్రికలు తిరిగి వెలువడడంలేదు? స్వానుభవంతోనే చెప్పాలంటే ఎమర్జెన్సీ ఎత్తివేయగానే ప్రారంభించాలని ప్రయత్నంచేసిన సృజనకు అధికారులు అడుగడుగునా అవరోధాలు కల్పించారు. సృజనమీద కోర్టులో కేసుందని ఎమర్జెన్సీలో ప్రెస్ సెన్సార్‌షిప్ కత్తెరకు గురైందని రకరకాల సాకులతో అడ్డుపుల్లలు వేశారు. ఇటువంటి అవరోధాలే యిప్పటికీ సోదర పత్రిక 'విమోచనకు' కల్పిస్తున్నారు. నిజానికివన్నీ చట్ట రీత్యా కూడా చెల్లనేరనివి.

పులిమీద పుట్రలా రెండు సంవత్సరాలుగా సాగుతున్న సృజనమీద 'రాజద్రోహనేరం'పై తీర్పు వరంగల్ సెషన్స్ కోర్టులో జులై 16న వచ్చింది. తీర్పు చెప్పడానికన్నా మూడు రోజుల ముందుగానే 13వ తేదీన ఎడిటర్, పబ్లిషర్ హేమలతను సెషన్స్‌జడ్జ్ జైలుకు పంపించాడు. ఆ పనికనుగుణంగానే రెండు సంవత్సరాల శిక్ష విధిస్తూ తీర్పు చెప్పాడు. ముగ్గురు పిల్లల తల్లి అయినందున దయచూపాలని అర్థించినా విచారణ కొనసాగిన కాలమంతా ఆమెలో పశ్చాత్తాపం కనిపించకపోవడంవల్ల 'న్యాయ ప్రయోజనాల రీత్యా' యీ శిక్ష విధించక తప్పలేదన్నది తీర్పు. హైకోర్టులో అప్పీలు చేసేదాకా యీ శిక్ష అమలు చేయకుండా నిలుపడానికికూడా జడ్జ్ నిరాకరించాడు. ఏమైతేనేం జూలై 19న హైకోర్టులో అపీల్‌ను అనుమతిస్తూ బెయిల్ యిచ్చారు. హేమలత 20వ తేదీన బెయిల్‌పై జైలునుంచి విడుదలయింది. నేరం 1974 మే రైల్వే సమ్మెను బలపరుస్తూ కవితలు ప్రచురించిన మే 74 సృజన. వివేచన పాఠకులకే వదులుతున్నాం. హైకోర్టు తీర్పుదాకా బెయిల్‌పైవున్నా రెండేళ్ళ శిక్ష వున్నట్టే అని గుర్తుచేస్తున్నాం.

—సాహితీ మిత్రులు

# కామ్రేడ్ పరిటాల శ్రీరాములు పోరాటం- కవిత్వం

కె. వి. రమణారెడ్డి

"అతను పీదవారిగుండెల్లో ఆశాజ్యోతి, నలిగిపోయిన జ్యోతికి ఆశాకిరణం, పీడితుల చైతన్యం" అంటూ, కామ్రేడ్ పరిటాల శ్రీరాములు నడిపిన పోరాటాల్లో స్వయంగా పాల్గొన్నవారు ఒక కరపత్రంలో రాశారు.

"నీ దౌర్జన్యాలకు వెరచి ప్రజానీకం నీ ఎదుట చెప్పలేనంతమాత్రాన చేసిన పాపాలు మరుగున పడ్డాయనుకున్నావా? ఎన్నడో ఒకనాడు నీ దౌర్జన్యాలకూ, దకాయితీలకూ అంతంకాకుండాపోదు." అంటూ యువజన సమాఖ్య పేర, శ్రీరాములును దౌర్జన్యకారునిగా, గూండాగా, కొందరు చిత్రించారు,

రౌడీగ్యాంగు నాయకుడుగా, దొంగతనాలు, దకాయితీలు, వ్యవసాయక విధ్వంసకచర్యలు, హత్యాప్రయత్నాలు వగైరా జరిపిస్తూ, రాష్ట్ర విప్లవరచయితల కార్యవర్గ సభ్యుడనని, నక్సలైటునని, "ధనిక రైతు కుటుంబానికిచెందిన పరిటాల శ్రీరాములు దొంగలను, రౌడీలను" పోగుచేసుకొన్నట్లు భారత కమ్యూనిస్టుపార్టీ అనంతపురం జిల్లా కమ్యూనిస్టు సమితి, ఒక కరపత్రంలో దూషించింది.

"పాత-కొత్త రివిజనిస్టులు ఎర్రజండా చేతపట్టుకొన్నా, వీళ్ళు భూస్వాములకు, ప్రభుత్వానికి తొత్తులన్న విషయం శ్రీరాములుపై వీరు జరుపుతున్న దుష్ప్రచారమే తెలియచేస్తున్నది" అని విరసం అనంతపురం జిల్లాశాఖ, కత్తిలా వర్గవిశ్లేషణ చేసి చూపింది.

కామ్రేడ్ శ్రీరాములు జీవితం అంతా యిలా ఖండనమండనలతో, దూషణభూషణలతో సాగిపోయింది. స్తబ్దుగా ఒక మూల ఒదిగి పడివుండకుండా, నిరంతర కార్యాచరణతో చురుగ్గా పనిచేసే వ్యక్తిత్వం కావడంవల్ల శ్రీరాములు ప్రజావంచకులదృష్టిలో దొంగ, గూండా, కిరాతకుడు, రౌడీ అయ్యాడు. అంతకంటె గొప్ప కితాబు ఏ ప్రజానాయకుడికీ అక్కర్లేదు. శ్రీరాములు శత్రువులెవరో చూస్తే, ఆయన ఎవరిమనిషో తెలుస్తుంది.

వెనకటి రోజుల్లో ధర్మవరం తాలూకాలో పరమభయంకరంగా జులుంసాగించిన భూస్వామి చిన్నపరెడ్డితో ఐదారేండ్లు పోరాటం సాగించికూడా, కమ్యూనిస్టుపార్టీ ఏమీ సాధించలేకపోయింది, అతని కుమారుడు రామసుబ్బారెడ్డి తండ్రిని మించిన ఘటం. కాబట్టే ప్రజల ఆగ్రహానికి సమిధైపోయాడు, ఈ హత్యకేసులో శ్రీరాములొక నింది

తుడు కిందికోర్టులో యావజ్జీవశిక్ష పడింది. రాజమండ్రిలోనూ హైద్రాబాద్‌లోనూ మూడేండ్లు జైల్లోవున్నాడు. పెండ్లయి ఏడెనిమిదేండ్లైంది. అప్పుడే గృహస్థజీవితం తోపాటు, పార్టీ జీవితంలోనూ ప్రవేశించాడు. గొట్టిపాటి సుబ్బారాయుడు తన కవిత్వ గురువుగా "అతిరసాల" వంటి ఆటవెలదులను "జుంటతేనె"వంటి తేటగీతులను అశ్రి యిస్తూ వచ్చాడు. జై సీతారాం స్నేహం కవిత్వసాధనకు తోడ్పడింది. సి. ముత్యా లప్ప, డి. ముత్యాలప్పవంటి పార్టీనాయకులు శ్రీరాములును ఒక మనిషిగా చేశారు. 1948–51 మధ్యకాలంలో కమ్యూనిస్టుపార్టీ జరిపిన గొప్ప భూపోరాటం శ్రీరాములును మరలా యోధునిగా మలిచింది. అందుచేతనే రామసుబ్బారెడ్డివంటివారికి ఆయన విరో ధిగా కన్పించాడు. ఆయన ఆయిల్ ఇంజన్ను వాళ్లు పగలకొట్టించారు. వ్యక్తిగత మైన భూస్వామ్య వ్యతిరేకతకూడ యిందుకు తోడైంది. ఈ హత్యకేసులో దొంగ సాక్ష్యాలు చెప్పించి 46 మంది నిందితుల్లో 13గ్గురికి శిక్షవేయించడం జరిగింది. జైల్లో రాసిన "పిలుపు" గేయంలో—

కోర్టూకు కళ్ళెక్కడివోయ్
చేటలంతా చెవులేనోయ్

అన్నాడు. "నా ఆర్గ్యుమెంటు"లో నిరపరాధులను నిర్దయగా శిక్షించిన న్యాయమూర్తి నుద్దేశించి యిలా అంటాడు— హంతకులనబడేవారు ఒక్కదెబ్బతో శత్రువునుచంపితే వాడేమో మూడేండ్లుగా మారణహోమం సాగించినవాడు. కొందరు మనుషులు తమ మానవత్వాన్ని మందగింపచేసుకొని యిలాంటి పనికి పూనుకొన్నారంటే, అతనిపట్ల యెంత ఏహ్యత ఏర్పడిందో న్యాయమూర్తి తెలుసుకోవాలి. పంచాయతీ ఎన్నికల్లో తనకు ఓటివ్వనివారి కాపురాలుకూల్చి కక్షలు సాగిస్తూ, పోలీసుల సాయంతో తనకు వ్యతిరేకమైన న్యాయమూర్తులనుకూడ హతమార్చబూనుకొన్న యిలాంటివాడిని మొద ట్లోనే చెరలోపెట్టివుంటే హత్యచేయవలసిన అవసరమేమిటి? చట్టాన్ని సొంతంచేసు కొని విర్రవీగుతూవచ్చిన ఇలాంటి దురహంకారుల పీచమణచేందుకు పనిచేసినందుచేతనే తమకు ఈ యిక్కట్లు వచ్చాయి.

హత్య ఒకటిచేయ హరియింత్రు ప్రాణాలు
మరణశిక్షవేసి, మాన్యులార
జనుల నెత్రుపీల్చు జలగలనెందుకు
పీచమణచలేరు, పూజ్యులార.

జైల్లో నిరాశా నిస్పృహలకులోనై తల్లిదండ్రులను భార్యాబిడ్డలను తలచుకొని బాధపడినా, శ్రీరాములు ఆవేదనతో అణగారకుండా విజ్ఞానమార్జించాలని

బంధీలోనే - ఉజ్వలభావికి
బాటల్ - వేయా
పరుగిడి రారా
అరుణ కిరణమది మెరిసెను అదిగో
కనలేదా? చూడుమురా!

అని సంకల్పం చెప్పుకొన్నాడు. అంతేకాదు. "నిత్యమెట్లో భూభక్షమణం సత్యమల్లె రణం, రణం" అని రాసిన ఒకగేయంలో "మెక్కనున్న స్వామికినీ/సొక్కియున్న నిరుపేదకు" ఆపలేని, ఆగిపోని, మహారణం సాగుతుందనిచెప్పాడు. ఆశావాదిగా రేపటి కోసం జీవించాలని గుండెదిటవు చేసుకొన్నాడు.

అప్పీల్లో హైకోర్టు బయటపడి వచ్చాక కుళ్ళుతున్న రివిజనిస్టు రాజకీయాల్లో నిలువ లేకపోయాడు. పార్టీ పేరుకుమాత్రమే కమ్యూనిస్టుగా మిగిలి, పూర్తిగా బూర్జువా పార్లమెంటరీ ప్రజాస్వామికమనే వూబిలో దిగిపోయింది. స్థానికంగా పంచాయతి రాజకీయాలు పార్టీ కార్యకర్తలను భ్రష్టుపట్టించాయి 1950-52 భూపోరాటంలో పేదలు సంపాదించుకొన్న శివాయి జమాభూములు కొన్నిచోట్ల తిరిగి భూస్వాముల, ధనిక రైతుల వశంకావడానికి పార్టీ దిగజారుడుకూడ కారణమైంది. ఉదాహరణకు, కొత్తగేరి పంచాయతి మెంబరు సీటుకోసం ఎగువపల్లి పేదలకు వెన్నుపోటుపొడిచి ఆ కూలీల గొంతులుకోసి వెళ్ళడంలో నేటి సి. పి. ఐ. జిల్లా కార్యదర్శి సదాశివన్‌కు స్వయంగా బాధ్యతఉంది. పార్టీ చీలికతర్వాత "మార్క్సిస్టు"చీటీ తగిలించుకొన్న సి. ముత్యాలప్ప ధనికరైతుల అండదండలతో నసనకోట పంచాయితీకి సర్పంచ్ కాగలిగాడు. అయితే వెనకటిరోజుల్లో పేదలాక్రమించుకొన్న యాభై యెకరాల భూమిని ఆరుకుటుంబాల ధనికరైతులకుచెందిన తమ పశువుల మేతకుగాను స్వాధీనపరచుకొంటే నోరెత్తలేదు. అంతేకాదు సహకార పరపతి సంఘాన్ని చేజిక్కించుకొని, నోరూవాయిలేని హరిజనుల పేరుతో అప్పులకు దరఖాస్తులుపెట్టించి, దాదాపు ఇరవైవేలదాకా కాజేశాడని సెంట్రల్ బ్యాంకు డైరెక్టర్ విచారణలోతేలింది. కాబట్టి ఈ పాత కొత్తరివిజనిస్టులు శ్రీరాములుకు శత్రువులుకావడం వింతకాదు. రాజకీయంగా స్తబ్దుపడిన ఈ దశలో శ్రీరాములు గ్రామ కక్షల్లో, ముఠా తగాదాల్లో పాల్గొంటూవచ్చాడని కొందరంటారు. నసనకోట పంచాయతీ సర్పంచ్ ఎన్నికల్లో తన తమ్ముడైన పి. యం. నారాయణను ముత్యాలప్పతో పోటీకి నిలిపినమాటమాత్రం నిజం. ముత్యాలప్ప ధనిక రైతులతో చేతుకలిపి గెలవడమూ నిజమే. ఈ ఓటమిమాత్రమే కారణంగా ముత్యాలప్పమీదా, ధనికరైతులమీదా కక్షపెంచుకొని రౌడీపనుల్లోనూ, కొట్లాటల్లోనూ పాల్గొన్నాడనడంమాత్రం నిజంకాదు. తాను స్వయంగా నలభై యెకరాల రైతు. న్యాయంగా తన వర్గసంబంధాలు ధనిక రైతు

లతో ఉండాలి. పార్టీ జీవితం మొదలైననాటినుండీ, భూస్వాములకు, నిరుపేదలకు మధ్య నిరంతరాయంగా సాగే మహారణంగురించే ఆలోచిస్తూ, ఆచరిస్తూవచ్చాడు. ఐతే ఈ దశలోమాత్రం రాజకీయాలకు దూరమై, నసనకోటప్రాంతంలో అబ్కారీ వేలం పాటల్లో పాల్గొనేవాడు. అందులో సంపాదించాడా అంటే, నేటి ఆర్థిక స్థితినిచూసినపుడు, 30 వేలు లోకులకు యివ్వవలసి ఉన్నాడు.

1967 నుండీ దేశ రాజకీయం గుణాత్మకంగా మారింది. సాయుధ విప్లవం ఎజెండామీదికి వచ్చింది. నక్సల్బరీ, శ్రీకాకుళాలు ఆశాజ్యోతులయ్యాయి. మార్క్సిస్టు-లెనినిస్టుపార్టీ అవతరించింది. శ్రీరాములు మళ్ళీ కమ్యూనిస్టు రాజకీయంవైపుమళ్లాడు. అబ్కారీ ఇజారా వ్యవహారాన్ని వదిలించుకొన్నాడు. భారత కమ్యూనిస్టుపార్టీ(మా-లె) నాయకులు కామ్రేడ్స్ రవూఫ్, బండయ్య వగయిరాలతో జిల్లాలో మొదలైన విప్లవ పోరాటాల్తో ఉత్తేజంపొందాడు. 'చైతన్య సాహితి' అధ్యక్షుడై విప్లవ సాహిత్యోద్యమానికి చేరువయ్యాడు. 1973 డిశంబరు 2న విరసం సభ్యుడయ్యాడు. '74 జనవరిలో కార్యవర్గ సభ్యుడయ్యాడు.

కామ్రేడ్ శ్రీరాములు రాజకీయ, సాహిత్య జీవితంలో ఇది మహోజ్వలమైనదశ. సాహిత్యంలోకంటె రాజకీయంలోనే ఎక్కువగా రాణించాడంటే, అది శ్రీరాములు యోగ్యతే. నసనకోట, ఎగువపల్లి, పిచ్చిరెడ్డి కొట్టాల, ముత్యాలంపల్లి, పాతగేదగికుంట, కొత్తగేదగికుంట, మాదాపురం, గరిమెకలపల్లి, మోటూరు చింతలపల్లి, తన స్వగ్రామం వెంకటాపురం గ్రామాల్లో భూమిలేని పేదలు సభ్యులుగా "భూపోరాట కమిటీలు" ఏర్పాటుచేయించాడు. ఈ కమిటీలపనిని పరిచూసేందుకు ఒక ప్రాంతీయకమిటీని నిర్మించాడు. ఇందులో సన్నరైతులు, మధ్యరకం రైతులు యెక్కువగా సభ్యులు. భూస్వాముల స్వాధీనంలోని శ్రోత్రియం భూములను, శివాయి జమాభూముల్నీ ఆక్రమింపచేసి సమిష్టిగా వ్యవసాయంచేసే పద్ధతిమీద పంటలు పెట్టించాడు. ఇలా ఆక్రమించుకొన్న భూమి దాదాపు వేయి ఎకరాలుంటుంది. కామ్రేడ్ చెరబండరాజు "తక్కువ మాటల యెక్కువకార్యము" అన్నది ఇదే.

భూస్వాములకు, ధనిక రైతులకు, పాత. కొత్త రివిజనిస్టులకు గంగవెర్రులెత్తాయి. ముత్తవకుంట చిన్నపరెడ్డి రెండవ కుమారుడు, హతుడైన రామసుబ్బారెడ్డి తమ్ముడు బాలసుబ్బారెడ్డి ఒకడు, చెన్నేకొత్తపల్లి సమితి అధ్యక్షుడు ఒకడు, పిచ్చిరెడ్డి కొట్టాలకుచెందిన చినవెంకటరెడ్డి ఒకడు, మాజీ యం.యల్.ఏ. నారాయణరెడ్డిఒకడు, ఇంకెందరో శ్రీరాములుమీద కత్తిగట్టారు. కడపజిల్లా సునకేసులనుండి హత్యే వృత్తిగాగల రౌడీలను పిలిపించి కొందరు పోషించడంకూడ జరిగింది. అయితే ప్రజలే శ్రీరాములను కంటికి రెప్పలా కాపాడుకొన్నారు. ఇంత సంకులమైన పోరాటంలో

[illegible] శ్రీరాములు కవిత్వాన్ని వదలి పెట్టలేదు. [illegible]
గేయం ఒక ఉదాహరణ. "ఓరన్నా-కూలివాడ"లో శ్రీరాములు ముప్పావుకూలి సేరు ధాన్యానికి రెక్కలువిరిగేట్లు పనిచేసే కలవారి కూలివాళ్ళను, పడిట ఒక్కపాలుకోసం ఆసాముల లాభంకోసం పనిచేసే పాలెవాళ్ళను సంబోధిస్తూ యిలా ప్రబోధించాడు.

సంగాలు పెట్టుకోనీ
సంఘటిత శక్తితోను
సంఘటితమవ్వాలంటా !
సౌమ్యంగా బతకాలన్నా
సాముల్ని తరుమాలన్నా
సాయుధుడు గావాలంటా !
సమరాన దూకవలెను
సర్కారు గూల్చవలెనూ.

భూస్వాములు శ్రీరాములుపై అతని అనుచరులపై పెట్టసాగిన కేసులు డజనుకు మించాయి. తమ ఆయిల్ ఇంజన్లు ఎవరో బద్దలుకొడితే ఒక కేసు, తమ చీనీతోటను పీకి వేశారంటూ మరొక కేసు, తమ భూములాక్రమించారంటూ యింకొక కేసు రివిజనిస్టులు భూస్వాముల వత్తాసుకొచ్చారు. 40-50 ఎకరాల భూస్థితికలిగినవారుకూడ రివిజనిస్టుల దృష్టిలో చిన్నరైతులే అయ్యారు. ఏమీలేనివారు ఎగిరిపోయారు అనేక గ్రామాల్లో జరిగిన గొర్రెల దొంగతనాలకు శ్రీరాములును బాధ్యుణ్ణిచేశారు. దొంగలను పట్టి ఆసాములకు తిరిగి గొర్రెలను అప్పగించిన తర్వాత కూడ ఈ ప్రచారం కొనసాగింది. ఆస్తి వ్యత్యాసాలున్నంతకాలం దొంగతనం అనివార్యమని చెపుతూనే తాము దొంగతనాలను ప్రోత్సహించమని నసనకోట పంచాయతి ఏరియా భూపోరాట కమిటీ ఒక కరపత్రంలో చెప్పింది. "..అటువంటి దొంగతనాలు జరగడానికి అస్కారాన్నిచ్చే యీ వ్యవస్థను మార్చాలనీ, పీడితుల బాధలను తొలగించాలనే మా ప్రయత్నం. వెనకటి భూపోరాటకాలంలో నాగిరెడ్డి, సదాశివన్‌లాంటి నాయకులపై గొర్రెల దొంగతనం నేరం మోపుతూ నాగిరెడ్డిగారి తండ్రిగారే ఒక కరపత్రం వేయించినట్టు ఆనాటి పోరాటం గురించి తెలిసినవారంటున్నారు. ఒకనాటి 'దొంగలు' మరొకనాటికి 'దొరలు' అవుతారేమో ! ధనిక రైతులనుండి జబర్దస్తీతో డబ్బు వసూలుచేస్తున్నట్టు రివిజనిస్టులు సాగించిన ప్రచారానికి సవాలుగా తాము బహిరంగ విచారణకు సిద్ధమని పోరాటకారులు ప్రకటించారు. శ్రీరాములును నక్సలైటుగా చిత్రించి ప్రభుత్వ నిర్బంధానికి బలిచేయాలని రివిజనిస్టులు "ప్రజల ప్రశాంతత" పేరుతో సిగ్గువిడిచి విజ్ఞప్తి చేయడంకూడ జరిగింది.

ఈ పరిస్థితిలో ఎగువపల్లి మెట్టభూముల ఆక్రమణ ఫలితంగా, ధనికరైతుల పక్షాన సి, ముత్యాలప్ప దొంగకేసులు పెట్టించినపుడు, ఆ "నమ్మకద్రోహి"పై పేదలు

గట్టిగా చేయిచేసుకోడం జరిగింది. అతని కాళుచేతులు విరిగాయి. ఆ ఘటనలో శ్రీరాములు లేడు. కానీ అతనిమీద కేసు మోపి గత డిసెంబర్‌లో నెలరోజులపాటు జైల్లోతోయడం జరిగింది. దీన్నిగురించి జిల్లా కమ్యూనిస్టుసమితి కరపత్రం 7-6-75లో "ఈ దుర్మార్గాన్ని జిల్లా కమ్యూనిస్టుపార్టీ ఖండించింది. తరిమెల నాగిరెడ్డి ఖండించి నాడు," అంటూ ఒక చారిత్రిక ప్రాధాన్యంగల వాస్తవాన్ని, రంగుల్లోగల సత్తాని తెలియజెప్పింది. ఈ అవకాశంచూసుకుని తన వియ్యంకుడైన వెంగమనాయుడుతో కలిసి, సదాశివన్ ఆ ప్రాంతంలో తన పార్టీని నిర్మించేందుకు ప్రయత్నించి శృంగ భంగం పొందాడు. పిచ్చిరెడ్డి కొట్టాల భూస్వామి చినవెంకటరెడ్డి తన చీనీతోటను శ్రీరాములు అనుచరులు ధ్వంసంచేశారని దొంగకేసు పెట్టించిన దరిమిలా, ప్రజాకోర్టులో అతన్ని నిలిపి అతడు పశ్చాత్తాపం ప్రకటించిన తర్వాత విడిచిపెట్టడమే జరిగింది. కానీ శిక్షించడం జరగలేదు. దీన్నిబట్టి, పోరాటకారులు కిరాతకులుకారని, విప్లవ చైతన్యంతో ఉచితానుచితాలు తెలుసుకొన్నధీరులనీ విదితమవుతుంది. రివిజనిస్టులు 'ప్రజలు భయభ్రాంతులైనారు' అన్నపుడు భూస్వాములు, ధనికరైతులు అని అర్థంచేసుకోవాలి. సి. ముత్యాలప్పకు "చుట్టూ 10 గ్రామాల్లో (జిల్లాలో వెదకినా) శత్రువులు ఎవరూలేరే" అని 'యువజన సమాఖ్య' పేరుతో కొందరు ప్రబుద్ధులు కరపత్రంలో రాసినపుడు, భూస్వాములకూ, ధనికరైతులకూ అతను మిత్రుడయ్యాడని అర్థంచేసుకోవాలి. శ్రీరాములు "గూండాయిజం" సాగిస్తున్నాడన్నప్పుడు: హింసనుగాక విప్లవ ప్రతిహింసను 'వైట్ టెర్రర్' (తెల్లబీభత్సం)కు ఎదురుగా 'రెడ్ టెర్రర్' (ఎర్రబీభత్సం)ను అమలు పెట్టాడనుకోవాలి. శ్రీరాములను హతమార్చేందుకు భూస్వాములు, ధనికరైతులు ఒక వైపు అరెస్టుచేయించేందుకు పాతకొత్త రివిజనిస్టులు ఇంకొకవైపున పనిచేస్తూవచ్చారు. 1972లోనే ఒక హత్యాప్రయత్నం జరిగి శ్రీరాముల అనుచరుడు చనిపోవడం, వీపున బల్లెపుపోటుతో శ్రీరాములు తప్పించుకోడం జరిగింది. సి పి ఐ జిల్లా కార్యదర్శి శ్రీరాములను, రైతాంగపు గెరిల్లాలను అరెస్టుచేయవలసిందిగా పోలీసులను కోరడం మొదలైంది. భూస్వాములు కొందరు యీమారు శ్రీరాములను చంపడానికి కుట్ర పన్నారు. అబ్కారీ వేలంపాటల్లో శ్రీరాములకు అనుచరుడుగ తిరిగిన సిద్దయ్యను దువ్వారు. వేలకుప్పురించారు. 303 రైఫిల్ అందించారు. సిద్దయ్య మొదట పశు పులకాపరి. నాటుతుపాకీ లైసెన్స్ సంపాదించి వేటగాడయ్యాడు. తాను బతుకుదెరువు కోసం భూస్వాములతో ఆట ఆడుకుంటున్నానని తన ఇంటిలో దీపంపెట్టిన శ్రీరాములు మీద తనకేకక్షలేదని నమ్మబలుకుతూ ఉత్తరంరాసినా, లోపల్లోపల శ్రీరాములుపై వైరం వహించాడు. మొన్న మే 29 సాయంకాలం, ఆంధ్రి సరిహద్దులకు కొద్ది దూరంలో మైసూరురాష్ట్రం తుంకూర్‌జిల్లా పవగడ తాలూకా క్యాతగానిచెర్లవద్ద 30, 40

మందితో దారికాచి, వల్లూరు గ్రామానికి పెళ్ళికోసం బస్సులోపోతున్న శ్రీరాములును అతని అనుచరులలో ముగ్గురినీ కాల్చిచంపాడు; ఈ హత్యతో తమకేమి సంబంధం లేదని రివిజనిస్టుపార్టీ జిల్లాసమితి గుమ్మడికాయలదొంగల చందంగా కరపత్రంవేసింది.

తాను మరికొద్దిరోజుల్లో రహస్య జీవితానికి పోయే యేర్పాట్లలో ఉన్న కామ్రేడ్ శ్రీరాములు ఈ దురంతంపాలు కావడానికి "అరయంగా కర్ణు(డీల్గెనార్గురిచేతన్". అప్పటికే మీసా చట్టం కింద అరెస్టు వారంటు హైద్రాబాద్నుండి అనంతపురానికి వచ్చి అమలుకు సిద్ధంగా వుంది. "కాగలకార్యం గంధర్వులు తీరుస్తారు" అని కొందరు పోలీసు ఆఫీసర్లు అంటూ వచ్చారు. హత్యకు నెలరోజులక్రితం ఉభయరాష్ట్రాల పోలీసుఅధికార్లు సమావేశమై శ్రీరాములు నాయకత్వానసాగే భూపోరాట ఉపద్రవాన్ని అరికట్టేందుకు ప్లాను వేశారు. హత్యకూడ ఆ ప్లానులో భాగం కావచ్చు. హత్యాస్థలానికి మైలున్నర దూరంలోని తిరుమణి స్టేషన్కువెళ్ళి, ఇంకా సాగుతున్న కాల్పులగురించి ఎవరో రిపోర్టిస్తే, "ఆ సిద్దయ్య ఇంకా పనిపూర్తి చేయలేదా? మేమురావాలా"అని ఇన్స్పెక్టరన్నాడు. పవగడ సర్కిల్ ఇన్స్పెక్టర్ జనం సమక్షంలో "మేము 20, 30 మందిమి చేయాల్సిన పనిని సిద్దయ్య ఒక్కడే చేశాడు. నిజానికి అతనికి అవార్డు యివ్వాలి"అన్నాడు. అంటే భూస్వాములు, వారి రక్షకులైన పోలీసులు, వారి తాబేదార్లయిన భ్రష్ట కమ్యూనిస్టులు మొత్తానికి దృశ్యంగానో, అదృశ్యంగానో శ్రీరాములు హత్యకు బాధ్యులే.

హంతకుడు హాయిగా స్వేచ్ఛగా ఉన్నాడు! హత్యావార్త విని సంతృప్తితో నవ్వు సాగిన దుండగులను ఎదుర్కొని కామ్రేడ్ శ్రీరాములు భార్య నారాయణమ్మ, "విప్లవం వర్ధిల్లుతుంది, విప్లవపార్టీవెనక ప్రజలున్నారు"అని చెప్పింది. ఆ ఉదయమే శ్రీరాములు అనంతపురంలో కోర్టుకుహాజరైన కామ్రేడ్ బండయ్యనుకలిసి శాలువాకప్పి రాజమండ్రి జైలుకు సాగనంపి వచ్చాడు. "జీవితాంతం విప్లవకారుడిగా జీవించి రైతుకూలీ పేదరుల పోరాటాలకు ప్రాణంగా మారుపేరుగా, విప్లవ రచయితగానేగాక, ప్రజల్తో సంలీనమై విప్లవోద్యమ నిర్మాతగా కామ్రేడ్ పరిటాల అటు రైతాంగానికీ, ఇటు విప్లవ రచయితలకూ తన రక్తంతో రహదారులు నిర్మించాడు"అని అనంతపురం విరసం శాఖ రాసిన మాట చెరిగిపోనిమాట కామ్రేడ్ పెద్దిరెడ్డి రాసినట్లు కామ్రేడ్ పరిటాల శ్రీరాములు నిజానికి "పోరాటాల శ్రీరాములు."

పరిటాలకు పర్యాయపదం అది
ఉన్నది ఒకటే పోరాటం అది పోరాటం.

— చెరబండరాజు

తూరుపునుండి మావో ఆలోచనామార్గంలో సాయుధులై సాగివస్తున్న సన్నకారు వాళ్ల ఒక్కొక్కరు ఒక్కొక్క చారుమజుందారై యీ ఇందిరాజాలముతో కూడిన

...ద్వారా విప్లవ ప్రభుత్వస్తారని "యెన్నాళ్లు యెగిరెదవమ్మా" అనే పాటలో శ్రీరా ములు తన విప్లవ విశ్వాసాన్ని ప్రకటించాడు. తిరుగబడిన పేదవాళ్ళమీదికి పోలీసు గాళ్ళను పంపి తమ మీసా చట్టం పేరుతో మీసాలు తిప్పే దుష్టాధికారియైన ఒక దుర్మా ర్గుడినోట్లో దుమ్ముపోయాలని అముద్రితమైన మరొకపాటలో అంటాడు. మాదిగోళ్ళ మల్లక్క, దబ్బర సుబ్బక్క, కోనమ్మ, కాళమ్మ గౌరమ్మ ఈ అకొన్న ఆడసింగాలు వాడిని మాటుకాచి చంపుతామంటూ కొడవళ్లు, గొడ్డళ్లు పట్టుకొని మరొక పాటలో ముందుకు వస్తున్నారు. శ్రీరాములు అంతగా పేదలతో పోరాటకారులతో మమేక మయ్యాడు. ఇది పాణిగ్రాహి వరవడి. ఉత్తరకుమార ప్రజ్ఞలుకానీ, బీరాలు కానీ తనకు తెలియనివి. బాధ్యతలు లేవంటే సంతోషించేతత్వంకాదు తనది. కోతకువచ్చిన వేళ కొమ్ము ఊదుతూ, డప్పువాయిస్తూ, మేమంటే మేమని ముందుకొచ్చే వాళ్లు, పం టను నాటినవారూ, వృద్ధికి తెచ్చినవారూకాదు. అదనింకారాలేదనీ, యింకా నేలపదును కాలేదనీ, విత్తులు చల్లేందుకు టైమురాలేదనీ, వాయిదాలమీద వాయిదాలు వేసేవాళ్ళు, విప్లవకారులమని పేర్లుపెట్టుకున్నా, విప్లవద్రోహులని చెప్పక చెప్తూ "ఉలిపికట్టెలు" లో శ్రీరాములు యిలా హేళనచేశాడు. "జాగ్రత్తరా బాబు యీ / 'జావళీ'గాళ్ళతో/ చేయి చెయ్యి కలిపేముందు / చెక్ (Check) సరిగా చెయ్యి "

శ్రీరాములు "దోపిడిదొంగల రంగుల పల్లకీని వర్ణించలేదు. జనతా ప్రజా స్వామిక విప్లవంలో సాంస్కృతిక సైనికుడిగా సాహిత్యాన్ని సృష్టించాడు." ఆయనకు విప్లవ జోహార్లు,

జాగ్రత్తరా బాబు యీ
'జావళీ' గాళ్ళతో
చెయ్యిగలిపే ముందు
'Check' సరిగా చెయ్యి

కోతకొచ్చిన వేళ
కొమ్మేసి- డప్పేసి
మేము యీరులమంటు
ముందుకొస్తారంట

అదనురాలేదంట
పదును కాలేదంట
యిత్తనానికి టయిము
యిదికాదు కాదంట

దోపిడీ దొరలంత
దుర్మార్గులయినారు
మనసు మార్చిన యెడల
మంచివా రౌదురట !

కోలాటం పాట :

# తుమ్మెదా!

పరిటాల శ్రీరాములు

పాడవే పాడవే తుమ్మెదా—ఒక్క పాటైన పాడవే తుమ్మెదా
జోహారు చెప్పవే తుమ్మెదా—మన చారుబాబుకూ తుమ్మెదా
జోహారు జోహారు తుమ్మెదా—మన చారుబాబుకూ తుమ్మెదా

పాతికేళ్ళనాడు — పరరాజు పోయాడు
నగత నగతా మనకు — నల్లదొరలొచ్చారు
గంపెడాశలుపెట్టి — గద్దెలెక్కారురా!
బూములిస్తామనిరి — బువ్వకేం కొదవనిరి
ఇండ్లు కడతామనిరి — వాకెండ్లు పెడతామనిరి
అరచేతిలోపలా — వైకుంఠమన్నారు ॥పాడవే॥

ఐదేండ్లకొకసారి — ప్రాణాళికలువేసి
పద్ధతిగ మెుంచారు — నట్టేట మనలనూ
ఓటుకొచ్చీనపుడు — మాటలెన్నో చెప్పి
నోట్లు చెల్లాడించి — సీట్లు కొట్టేశారు
ఢిల్లీ విడిచీమళ్ళ — పల్లెలకురారురా!
అయివు దొరకదుమల్ల — ఐదేండ్లదాకాను ॥పాడవే॥

ప్లానులెన్నోవేసి — పన్నుల్ని పెంచేసి
పండినా పంటంత — పక్కనా దాచేసి
కరువొచ్చినాదనీ — కంట్రోలు పెట్టేసి
అధికధరలూ పెంచి — ఆకలితో మాడ్చేసి
బువ్వడిగినోడికీ — తూటాలు యిచ్చేసి
రామ రాజ్యమ్మంచు — రచ్చలో సెపుతారు ॥పాడవే॥

దినదినానికి బతుకు — దిగజారిపోయింది
దినదినాగండంగ — యిన్నాళ్ళు బతికాము
ఇన్నేళ్ళ తరువాత — ఇప్పుడే మెుండాడి
బూమి బాకీల్పాలు — ఎద్దు ఎనుబోతాయె
ఇల్లు వడ్డికిపోయె — గుడిసి కాలీయాయె
పంచి గోచీయాయె — చీరకొన గతిలేదు
ఎన్ని తిప్పలుపడిన — తిండి దొరకకపాయె ॥పాడవే॥

చంటివాడికి జరము — మందులేవీ బాబు
చిన్నోడు సదవాల — గొడ్డెవడు కాస్తాడు
చదివినా పెద్దోన్కి — ఉద్దోగమేదిరా ।
పెద్దపిల్లెదిగింది — పెల్లెట్లసేత్తావు
మిగిలినా బాకీలు — మించిపోతున్నాయి
కాంగ్రేసు పాలనలో — కడగండ్లు మిగిలాయి
కాంగ్రేసు రాజ్యాన — కష్టజీవికి సుకము
లేదోయి లేదోయి — తుమ్మెదా-ఇంక లేనేలేదు తుమ్మెదా ॥పాడవే॥

ఇదియేమి అంటేను — మీ ఖరమమన్నారు
ఎనకజనమూలోన — ఏమిచేసిందావో
జగమంతుడిట్లాటి — బతుకిచ్చినాడని
మెట్టవేదాంతాలు — మస్తుగా చెప్పారు
ఉన్నోల్లు అంతాను — ఊరబందుల్లాగ
ఉబ్బిపోతుండారు — ఊరిపోతుండారు... ॥పాడవే॥

బ్లాకు యాపారంలో — బలిశారు కొందరూ
లంచాలు గుంజేసి — లావైరి అధికార్లు
కంట్రాక్టులనుజేసి — కదిబడిరి కొందరూ
దొంగబంగారాన — దొరలైరి కొందరూ
రాజకీయాలకూ — రంగులే మార్చేసి
అందలం ఎక్కాక — అందర్ని ముంచారు
పేదోడి చెమటచే — పెన్నిదులు పెంచారు
బలిసిపోయినవారు — తెగబలిసి పోయారు:... ॥పాడవే॥

చూచాడు చూచాడు — మన చారు చూచాడు
పేదవాడినిచూచి — పేగులే కరిగాయి
మార్క్సిస్టు-లెనినిస్టు-మావో ఆలోచన
మనకు బాటన్నాడు — మరువకంటన్నాడు
పనిచేసినోల్లదే — పెత్తనం అన్నాడు
నిప్పు నీరూ నింగి — భూమిపై, గాలిపై
సమతకావాలనే-తుమ్మెదా-అదె సౌభాగ్యమన్నాడు తుమ్మెదా ॥పాడవే॥

గొంతెత్తి పిలిచాడు — ఎలుగెత్తి చాటాడు
నీ కష్టఫలితమూ — నీకు దక్కకుండ
కాంగిరేసూవారు — కాజేసిరన్నాడు
నీ శ్రమా ఫలితము — నీకుదక్కాలంటే
ఊ జలగలన్నిటిని — దునుమాడ మన్నాడు.
'మల్లి పడినాజొన్న' — మరిపండదన్నాడు
యీ్యాకలుపు మొక్కల్ని — ఏరేయమన్నాడు
తిరగబడి పీనీ — తిమిరణచమన్నాడు
గొంతెత్తి పిలిచాడు — గర్జించినాడురా ॥పాడ వే॥

నక్సల్ బరీలోన — వెగడురగిలించాడు
ఉబ్బసం రోగమైన — ఊపిరాడకయున్న
ఊరూరు తిరిగాడు — ఉద్రూతలూచాడు
వీరు ఘూముల్లోన — అగ్గిమంటల్లేపె
సీకాకులంలోన — చిరుమంట పెద్దదై
కాంగిరేసోల్లకు — కంపరం పుట్టించె... ॥పాడ వే॥

సత్యమయ్యా లేచి — సరియైనదోవలో
ఉద్యమము నడిపాడు — నిద్రలేపిండాడ
హరిజనుడు, గిరిజనుడు — అంత లేచిండారు
కూలోడు రైతోడు — కూడిలేచిండారు
పిలుపందుకొన్నారు — విల్లందుకొన్నారు
బందూకు బట్టారు — భళిభళి అన్నారు
వర్గశత్రువుగుండె — గునపాలు గుచ్చారు... ॥పాడ వే॥

తామాడ గణపతి — జట్టు ఉమాపతి
పంచాది కిట్టన్న — నిర్మలమ్మా తల్లి
సుబ్బారావన్నయ్యా — అంకమ్మ-సారమ్మ
ఆదిభట్లన్నయ్యా — చాగంటి భాస్కరుడు
గుమ్మడి లచ్చన్న — గోరంట్ల కోటేశు
బిక్కా రామన్న — తాబేలు నాయుడు
జగదీష అన్నయ్యా — మల్లిఖార్జునుడు
కొల్లివర అన్నయ్య — తామాడ తమ్ముడు
రాజరాము రెడ్డి — శృంగార్పు నరసన్న

అడవిలన్ని తిరిగి — అందరిని మేల్కొలిపి
రంగాన పురికించి — రాటుదేలించారు ॥పాడవే॥

వర్గచైతన్యము — వెల్లివిరిసిందిరా
దోపిడీదారుల్ని — దుమ్ముదులిపేరురా
అధిక వడ్డీ గుంజే — ఆసాములందర్ని
అధికలాభాలొందు — అయ్యగార్లందరిని
అణచిపారేశారు — అణగదొక్కేశారు
వారు నడిచినబాట — వారు సలిపినపోరు
ఊచకోతాకోసి — ఊపిపారేశారు... ॥పాడవే॥

ఇదిజూచి ఇందిరా — అదిరిపోయిందిరా
గుండెబేజారెత్తి — గంగవెర్రూలెత్తె
తక్తునెక్కగబోవ — తనువు కంపించింది
ఎండి కిరీటము — యాడనో మరిచింది
సోషలిస్టూ రాణికి — సోషవచ్చేసింది
శివమెత్తి పోయింది — తైతక్కలాడింది
కల్లుదాగిన కోతి — కై పెక్కి పోయింది
తాను రోజూచెప్పు — సోషలిస్టు మంత్రాలు
పనిజెయ్యలేదని — పసిగట్టగల్గింది ॥పాడవే॥

శ్రీకాకుళంబంత — సీఆర్పి నింపింది
ఊరికొక్కటి లెక్క — పోలీసుకేంపులై
పల్లెల్ల ప్రజనంత — కేంపుల్లొ కుక్కారు
మార్క్సిస్టు-లెనినిస్టు — ముఖ్యులెవ్వారని
ఎచ్చటున్నారని — ఎందు బొయ్యారని
చెప్పినోడికి లెక్క — బోమాన మొస్తుంది
చెప్పనోడికి బూటు — దెబ్బలివిగోయనిరి ॥పాడవే॥

బోమాన మెందుకురా — బోడిగా మాకు
కామ్రేడులను మీకు — పట్టి యిచ్చేకంటె
కటికకే పోతాము — కాటికే పోతాము
ఇబ్బందులెన్నయిన — ఇంసలెన్నిపడిన
వాయకులమాటేమొ — వోరిప్ప మన్నాదు ॥పాడవే॥

అప్పుడేం జేశారు - అడవులన్నీ నరికి
అడుగుకొక పోలీసు - అరాలు తీశారు
చిక్కినోడినల్లా - చితుక కొడితారు

| ఒక్కటే ఒక ప్రశ్న - నువ్వెవరు నువ్వెవరు
10 | దానికొక జవాబు - నేను కమ్యూనిస్టు
| మార్క్సిజం-లెనినిజం - మావోపంథా వాద
| అంతకూ మించింది - యింకేమి చెప్పరు ||పాడవే||

చెప్పించ జూసిరీ - ఇంసింప జూసిరి
కీళ్ళ ముల్లూగుచ్చి - కాళ్ళ ముఖుకులు గొట్టి
| కండ్లకారము చల్లి - పండ్ల నూడబెరికి
| కండ్లు బొడిపించారు - గూండ్లీపునెత్తారు
ఇంసించి ఇంసించి - ఇసుగొచ్చి పోయింది
ఎంత యింసించినా - ఎవ్వారనడిగినా
ఒక్కటే ఒక మాట - ఒక్కటే ఒక బాట
పానమ్ము కంటేను - పార్టీయె మిన్ననిరి ||పాడవే||

| యీ సమాజమ్మును - మార్చి వేస్తామనిరి
| కాంగ్రేసు రాజ్యాన్ని - కూలదోస్తామనిరి
11 | సమ సమాజము మేము - నిర్మింప బూనాము
| సమ సమాజము కొరకు - సామ్యవాదం కొరకు
| పానముండేదాక - పోరాడుతామనిరి ||పాడవే||

ఒక్క   ఎతమంది - చుటుముటారురా
నిస్సహాయుల జేసి - నిలబట్టి కాల్చారు
కి దపడుతూ వా   ధూ జ్యా_నూకాయి
మ్మల్ని చంపినా - ఆశయం చావదు

మా రగతపుటేరు - దేశమంతా పారి
ఎరుపు మయము జేయు - ఎరుపు రాజ్యమేలు
ఎరుపు రంగే మిమ్ము - యేటాడునన్నారు ॥పాదవే॥

| చారు జూపిన బాట - చావబోదన్నారు
| చారు మజుందారు - జోహారు అన్నారు
| మావో చూపిన బాట - మాసిపోదన్నారు
12 | విప్లవం వర్ధిల్లు - వర్ధిల్లు నన్నారు
| వీర మరణము మాది - విజయమూ మాది
| అనుచు నేలానొరిగి - అసువులే వీడారు
| అశరీరులయ్యారు - అమరులయ్యారురా ॥పాదవే॥

అమరులయినా వారు - అనిన మాటలు మనము
ఆచరణలో పెట్టి - అమలు పర్చాలిరా
సోమరిగ కూకుంటె సమత ఎట్లావచ్చు ?
13 | అదునిదే, పదునిదే - ఆలశ్యమేలరా
| అందించు గొడ్డలి - అందుకో బల్లెము ॥పాదవే॥

అల్లదిగో తూర్పున - రకత పేరును[10] చూడు
నీ అంగి యిప్పరా - యేరులో ముంచరా
ఎగరేయరా పైకి - అరుణ కాంతులు జల్లు
14 | బందూకు లేలరా - బల్లాలు చాలురా
| కాశిదట్టి[11]గట్టు - కత్తి భుజానెట్టు
తీసుకోరా పలుగు - పారెత్తి లేవరా ॥పాదవే॥

బయనెట్లు కూలరా - బయమేలరా నీకు
ఊళ్ళ నేలేటి - ఊరి పెద్దలను

---

10. రక్తపు యేరు.   11. కాసె దట్టి (దట్టి అంటే అడ్డపంచె)

పట్నాలు జేరినా - భూసామి కొడుకులను
బొజ్జ పెరిగిన వాళ్ళ - బరతమూ పట్టరా
నిన్ను నిలువున దోచు - నీచాతి నీచులను
కనికరం జూపకా - పనిబట్టి వెయ్యరా
ఊపిరి బిగబట్టి - వుక్కునణగించరా ॥పాద వే॥

తూరుపు దగిలింది - దేశమంతా ఎఱగె
ఆ ఎలుగులో నువ్వు - నీ బాట నడవరా
తూరుపు తిక్కెరుపు - సంజపొద్దూ ఎరుపు
నీ గుండె ఎరుపురా - నీ జెండ ఎరుపురా
నీ కోపమెరుపురా - నీ నెత్తురెరుపురా।
ఎత్తరా నీ కత్తి - ఎత్తరా నీ జెండ।
15 వర్గ శత్రువు కఠిన - దుర్గమ్ము కూల్చరా
నీ శ్రమకు ఫలితమూ - నీకు దక్కేదపుడె

# ఎమర్జెన్సీ కారణంగా వెలుగు చూడని
# పరిటాల శ్రీరాములు సంస్మరణ సంచిక

ఎమర్జన్సీ ప్రకటించిన 26 జూన్ 75 నాటికి సృజన పరిటాల శ్రీరాములు సంస్మరణ సంచిక 16 పేజీలు అచ్చయింది. ఎమర్జన్సీ క్రూర శాసనాల్లో భాగంగా వచ్చిన ప్రీ సెన్సార్ షిప్ నిబంధనల దృష్ట్యా అచ్చయిన రచనలు, కావలసి వున్న రచనలూ ప్రీ సెన్సార్ షిప్ అధికారులకు ఇవ్వవలసి వచ్చినది. ప్రీ సెన్సార్ షిప్ అధికారులంటే అధికారికంగా జిల్లా కలెక్టర్ కావచ్చు కాని వాస్తవంలో ఎస్. బి. వాళ్ళేనన్నది ఎమర్జన్సీ గురించి అర్థమయిన అందరికీ అర్థమవుతుంది. ఇంత క్రూరమైన పత్రికా నిర్బంధ విధానాల కింద సృజన వెలువరించడం అసాధ్యమని తేలిపోయాక, ఆర్థికంగా ఏర్పడిన ఇబ్బందుల వల్ల కూడ పత్రిక ఆపివేయాలని నిశ్చయించుకొని రచనలు వాపసు ఇవ్వవలసిందిగా దరఖాస్తు ఇవ్వవలసి వచ్చినది. జవాబును మూడవ కవరు పేజీలో యథాతథంగా ప్రచురిస్తున్నాము. 'జులై 75 సంచికను సైక్లోస్టైల్ రూపంలోగానీ, లిథోగ్రాఫ్ రూపంలోగాని ప్రచురించ కూడదని సలహా ఇవ్వవలసి వచ్చినది. లేని మేరకు రూల్స్ ప్రకారం చర్య తీసుకోబడుతుంది' అన్నది సారం. రూల్స్ అంటే ప్రీ సెన్సార్ షిప్ రూల్స్ అని వేరే చెప్పాలా? మాకు తిరిగి యిచ్చిన రచనల్లో అభ్యంతరకరమని ప్రీ సెన్సార్ షిప్ అధికారులు భావించిన వాక్యాలు, పేరాలు పెన్సిల్ తో గుర్తులు పెట్టారు. సామాన్యంగా అభ్యంతరకరమనుకున్న పేరాలకు పక్కన గీతలు పెట్టి నెంబర్లు వేసారు. పెద్ద పెద్ద పేరాలు బ్రాకెట్ చేసారు.

ఈ సంచిక 5 నుంచి 16 వరకు పేజీలు ఎమర్జెన్సీకి ముందే ప్రింట్ అయి వున్నందున ఆ పేజీల్లో "అభ్యంతరకరమైన"వని చూపిన అంశాల వివరాలు ప్రక్క పేజీలో యిస్తున్నాం.

| పేజీ నెం. | లైన్లు | సెన్సారు వారి సంఖ్య |
|---|---|---|
| 6 | 13, 14 | 32 |
| 6 | 17 నుండి 19 | — |
| 6 | 25 నుండి 28 | 33 |
| 7 | 1 నుండి 5 | 34 |
| 7 | 10, 11 | — |
| 8 | 2వ పేరా | 1 |
| 9 | 5 నుండి 12 | 2 |
| 10 | 17 నుండి 20 | 3 |
| 11 | 2వ పేరా | 4 |
| 11 | చివరి పేరా | 5 |
| 12 | 1 నుండి 7 | 5 |
| 13 | 4 నుండి 9 | 6 |
| 14 | 6 నుండి 8 | 7 |
| 14 | 28 నుండి 29 | 8 |
| 15 | 1 నుండి 22 | 8 |
| 16 | 10 నుండి 18 | 9 |

ఎమర్జెన్సీ తర్వాత అచ్చయిన మిగిలిన రచనల్లో "అభ్యంతరకరంగా" చూపబడినవి రచనలతో పాటే గుర్తుల ద్వారా సూచించాము.

[24 జూన్ 77న రాష్ట్ర శాసన సభలో సమాచార మంత్రి ఎమర్జన్సీ కాలంలో ప్రీ సెన్సార్ షిప్ నిబంధనలు ఏ పత్రిక మీద కూడా ప్రయోగించలేదని, ఆ కారణంగా ఏ పత్రికా ఆగిపోలేదనీ చెప్పాడు. అందుకే మీ ముందు ఈ ప్రత్యక్ష సాక్ష్యాధారాలు వుంచుతున్నాం. అంత మాత్రాన ఒక్క సృజన మీదనే ఈ నిర్బంధం కొనసాగిందని కాదు. సృజనతో పాటు జీవనాడి, విమోచన, పిలుపు, జనశక్తి వంటి పత్రికలు కూడ ఎమర్జన్సీ కాలంలో ఆగిపోవడానికి ప్రీ సెన్సార్ షిప్ నిబంధనలే పూర్తిగా కారణమన్నది ఏ మాత్రం వివేకమున్న వాడైనా ఒప్పుకుంటాడు.]

***

# పరిణామ క్రమంలో దేవుడు

—పరిటాల



యవ్వనంలో శ్రీరాములు

ఆదిమ మానవుడు పశుపక్ష్యాదులతో సహజీవనం నెరపుతున్న కాలంలో తన ఆహారాన్ని సంపాదించు కోడానికి వాటి నుండి వేరుపడి, కొత్త పద్ధతులలో తన ఆహారాన్వేషణ ప్రారంభించాడు. ఆ అన్వేషణలో మానవుడు ప్రకృతితో విరిగా పోరాడ వలసి వచ్చేది. ఆ దశలో ప్రకృతిని గురించి ఎంతో నేర్చుకుంటూనే తన ఊహకందని ప్రతి విషయాన్ని అతీత శక్తిగా భావించసాగాడు. ఉదాహరణకు సూర్యుడున్నంత సేపూ ప్రకృతి సౌందర్యాలను, తన ఆహారాన్ని శత్రువులను స్పష్టంగా చూడగలిగి సూర్యాస్తమయం తర్వాత చీకటినధిగమించ లేకపోయాడు. చీకటి జీవితాన్నల వరచుకొన్న మనిషి ప్రకృతి సిద్ధంగా ఉత్పన్నమయ్యే కార్చిచ్చులను చూచి ఆ వెలుతురును దైవంగా పూజించ సాగాడు. తన శారీరక బలంతో క్రూర మృగాలను ఎదిరించగలిగినా - పాముల్లాంటి విషకీటకాల బారినుండి తప్పించుకొనే దారి తెలియక వాటితో రాజీ పడటమే మార్గంగా తలచాడు. ఆ భావం వల్లే వాటిని స్తుతించసాగాడు, క్రమంగా అదే పెరిగి నాగుల ప్రతిష్ఠ, పుట్టలలో పాలు పొయ్యడం వరకు వచ్చింది. అలా వచ్చి విషజంతువయిన పాము మనకారాధ్య దైవమై తిష్ఠవేసింది. అప్పటి నుండి మానవుడు తన అభిప్రాయములను చంపుకొని తన వ్యతిరేకుల్ని పొగడ్తలతో ప్రార్థనలతో లొంగ దీసుకోవచ్చనే మూఢభావం అంకురించింది.

పరిణామక్రమంలో మానవుడు తన ఆహారాన్వేషణకు ప్రకృతి శక్తుల్నెదుర్కొనే సులువు కోసం సంఘంగా బ్రతకడం నేర్చుకున్నాడు. అనంతమైన యీ ప్రకృతి శక్తుల్లో తన ఆలోచనా పరిధులలోకి రాని వాటిని 'శక్తి'గా 'అతిశక్తి'గా ఊహించి దాన్ని తాను భేదించలేనని, దానికి తాను తలవంచి తీరాలనే భావమేర్పరచు కొన్నాడు. తను జయించలేని ఆ స్థితి నుండి తన్ను తన సంఘాన్ని రక్షించు కోవాలనే తపనలో పూజలు, బలులు, శాంతులు జరిపి ఆ అదృశ్య ప్రకృతి తమ్ము కాపాడుతుందని ఒక మిథ్యా భావమేర్పరచుకొని సంతృప్తి పడ్డాడు రాను రాను ఒక్కొక్క గుంపు లేక ముఠాకు ఈ పూజల కొరకే ఒక వర్గం వెలసింది వారే పూజారులు. వారు మొదట తమ గుంపు శ్రేయస్సు కొరకు ప్రకృతి శక్తులను పూజించడమే పనిగా పెట్టుకొని మొత్తం గుంపుచే పోషింపబడేవారు. ఆ 'క్రియ' శాశ్వతమై నియమబద్ధంగా ప్రతి కుటుంబము ఖచ్చితంగా కొంత ముట్ట చెప్పే ఆచారం అమలు లోకి వచ్చింది సరిగ్గా అదే సమయంలో యజమాని - శ్రమజీవి శ్రమ శక్తిని దోచుకొనే అలవాటు ప్రారంభమైంది. వీటికి అలవాటు పడిన పూజారులు వారి వారి గుంపులతో తమ స్థానాల భద్రత కొరకు దైవ మహిమలను మరి కొంత పెంచి ఆ శక్తులకు తోచిన పేర్లు పెట్టి, వాటి ప్రభావం వల్లనే మానవుడు సుఖ జీవనం నెరపగలడనే మూఢనమ్మకం ప్రచారంతో పెట్టడం జరిగింది. చివరకు పూజారులకు ఆగ్రహం కలిగించినా ఏదో అనిష్టం జరుగుతుందనే వరకు వచ్చింది.

ఇలా పెత్తనం స్వాధీనం చేసుకొన్న తర్వాత నియమములను ఉల్లంఘించే వారిని శిక్షించుటకై పూజారి వర్గమునకు అంగబలం అవసరమైంది. ఆ అంగబలానికి శిక్షణ నిచ్చుటకు ప్రజలిచ్చిన ధనాన్ని కాపాడుటకు ఒక బలాఢ్యుడైన నాయకున్నెంచుకున్నారు యీ విధంగా యేర్పడిన పూజారులే గురువులుగను, అంగబల నాయకులే రాజులుగను మారారు. పౌరాణిక యుగంలో మనకు దొరికే ఆధారాలనుచూస్తే రాజులకన్నా రాజగురువులదే అగ్రస్థానమన్నది స్పష్టమౌతుంది

అంగబలాన్ని పెంచుకుంటూపోయిన రాజగురువులు అంగబల పోషణకు తమ ప్రజలలోని ఒక వర్గాన్ని నియమించి వారిని ఉత్పత్తిదారులుగా చేశారు. వారి ఉత్పత్తిని సేకరించుటకు ఒక వర్గాన్ని నియమించారు. ఈ విధంగా జాతుల విభజన జరిగింది. అట్లేర్పడిన జాతులు చాతుర్వర్ణ ధర్మములని - అవి

దైవనిర్మితములని, వాటిని ఉల్లంఘించకూడదని, ఉల్లంఘించిన పాపకూపములో పడుదురనీ ప్రజల్లో విపరీత ప్రచారము గావించిరి. పాప-పుణ్యము[లు], స్వర్గ-నరకము[లు], కర్మ, విధి, పూర్వజన్మ సుకృత-దుష్కృతములనెడి మూఢ భావాలను పెంచి తమ వర్గ రక్షణకు దేవున్నొక సాధనంగా జేసుకొని ఇంకొక వర్గాన్ని దోచుకోవడం పారంభమైంది.

ఈ విధంగా ప్రారంభమైన దోపిడీకి అంతులేకుండ పోయింది. ప్రకృతి శక్తులను పరిశోధించడమేగాక భగోళాన్ని సైతం పరిశీలిస్తూ చంద్రగోళంలో మానవుడు స్థావరాన్ని నిర్మించుకొంటున్నాడు. సరిగ్గా ఇదే సమయంలో బీటలు వారిన తమ దోపిడీ సౌధానికి మరమ్మతు చేయుటకు దోపిడీ వర్గం స్వాములకు, బాబాలకు, అమ్మలకు వత్తాసునిస్తూ ప్రజలను మళ్ళీ మౌఢ్యంవైపు నెట్టుతోంది. చివరికి మన పాలకులు కూడా వాన రాకపోతే వరుణదేవుణ్ణి ప్రార్థించమంటున్నారు. అందులకై ప్రజల సొమ్మును వేనకు వేలు వెచ్చిస్తున్నారు. ఈస్థితిలో యువతరం ప్రజల్లో జొరబడి మతానికి వ్యతిరేకంగా మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా - దైవత్వానికి వ్యతిరేకంగా పనిచేయక తప్పదు. కోటి మానవుని ఆవేదనలు-ఆక్రందనలు వినకుండా దేవునిపేర యజ్ఞయాగాదులు చేయించుతూ మంత్రాంగాన్ని నడుపుతున్న ప్రభుత్వ యంత్రాంగంలోని కుళ్ళు రాజకీయాల్ని అరగట్టకపోతే మళ్ళీ ఈ దేవుడు మనుషుల నెత్తిన పూరేగగలడు. సహజ సిద్ధమైన మానవుని ఆలోచనాశక్తికి అడ్డుకట్టలు వేయుచూ తమ పబ్బం గడుపుకోవడానికి వెలయిస్తున్న దేవుళ్ళు, తీర్థాలు, మఠాలు, భజన మందిరాలు సమూలంగా నాశనమైతే తప్ప మానవ ప్రగతిని సాధించలేము. సృజనాత్మకమైన ఆలోచనలకు ప్రతిబంధకాలయిన మూఢభావాలనుండి విముక్తిపొందితేనే అట్టడుగునపడి అలమటిస్తున్న వాడికి విముక్తి లభిస్తుంది. కనుక మానవ ప్రగతికి శత్రువయిన దేవుడి నధిగమించడం మన మొదటి కర్తవ్యం.

(ఇరవై సంవత్సరాల క్రితం రాసిన వ్యాసం)

( 25-6-75 న రాయబడిన ఒక కరపత్రాన్ని దానికున్న చారిత్రక ప్రాముఖ్యం దృష్ట్యా ప్రచురిస్తున్నాం. ఇది కరపత్రంగా అచ్చుకాలేదు, జులై 75 సృజనలో వేయాలని ప్రీ సెన్సార్ షిప్ అధికారులకు సమర్పించుకుంటే మొత్తంగా నిరాకరించబడింది. అయితే ఇది ప్రీ సెన్సార్ షిప్ క్రూర శాసనాలకే కాదు, ఎమర్జన్సీకన్న ముందు కూడ ఎన్నాళ్ళుగానో విప్లవకారులపై విప్లవ సాహిత్య-సాంస్కృతిక సంస్థలపై రచయితలు, కళాకారులపై ప్రజాస్వామ్య శక్తులపై ఇందిరా-వెంగళరావు దుర్మార్గ పాలన అమలు చేసిన దారుణ హింసా కాండకు కూడ దాఖలాగా వుంది. ప్రీ సెన్సార్ వాళ్ళు పెన్సిల్ తో మొత్తం కర పత్రాన్ని నిరాకరిస్తూ ఇంకా కొంచోట్ల పెట్టిన గుర్తులు యధాతథంగా ఇస్తున్నాం. "...లాఠీ రాజ్యంలో" అనేమాటకూ, "ఒక్క ఇందిరా ఇండియాలో నే" అనే మాటకు కింద గీతలు గీయడం ప్రత్యేకంగా గమనించండి. )

× 31

**సాహిత్య సాంస్కృతిక సంస్థలు వర్ధిల్లాలి! ఫాసిజం నశించాలి.**

# జననాట్యమండలి కళాకారుల్ని, విప్లవ రచయితల సంఘం సభ్యుల్ని, రాడికల్ యువజనుల్ని బేషర్తుగా విడుదల చేయాలి! అక్రమ కేసులు ఎత్తివేయాలి!

×

కామ్రేడ్స్,

నాజీల దురంతాలు, నైజాం రజాకార్ల అమానుష చర్యలు మనకింకా గుర్తున్నాయి. మూడు పువ్వులు ఆరు కాయలుగా "ప్రజాస్వామ్యం" వర్ధిల్లు తూందని పాలకులు చాటని క్షణమైనాలేదు. కాకీదుస్తుల్లో ఎవ్వరు తలదాచుకుందో, ఎవ్వరు ముసుగులో కాకీదుస్తులు రాజ్యం చేస్తున్నాయో పేద ప్రజానీకమూ విద్యార్థులూ యువకులూ రోజు రోజూ స్వానుభవంగా తెలుసుకుంటున్నారు.

గుంటూరులోని గుజ్జన గూళ్ళలో జూన్ 22న జరిగింది, అలనాటి జలియన్ వాలాబాగ్ దుర్ఘటనను మరిపిస్తూంది. గుంటూరు ఎస్. పి., డి. ఐ. జి., వగైరా అపర డయ్యర్ దొరలయ్యారు. పోలీసులు స్వైర విహారం చేశారు.

గుంటూరు జిల్లాలో రేడికల్ యువజన సంఘం మహాసభలకు సన్నాహంగా జననాట్య మండలి, హైదరాబాదు అనేక ప్రదర్శన లిచ్చింది. వేలాది పేద ప్రజలు తమకన్న బిడ్డలుగా ఆదరించిన జన నాట్యమండలి కళాకారులు పోలీసులకు తమ శత్రువులుగానూ రాజద్రోహులుగానూ కనిపించారు. అందుకే కాటోలు గుజ్జన గూళ్ళ ప్రదర్శనలో 'ఓలోలి అమీనోడా' అనే పాట మొదలు కాగానే, పోలీసుల పైశాచికత్వం కట్టలు తెంచుకుంది. అంతే—

—అంతకు ముందే సివిల్ డ్రెస్సులో పోలీసులు తమ లాఠీలను ఒక చోట పెట్టివచ్చి ప్రేక్షకుల్లా అమాయక ప్రజలమధ్య కూర్చున్నారు. ఆ పాట మొదలు కాగానే లేచి, వ్యాన్లలో వచ్చిన పోలీసులతో కలిసి, లాఠీలను అందుకొని, చేతికందిన ప్రతి ఒక్కడినీ నిర్విచక్షణగా బాదడం ప్రారంభించారు. లైట్లు ఆర్పివేశారు. చీకటి...భయభీతావహం...పగిలే తలలు...విరిగే చేతులు ...పడి గాయాలు తగులుతూన్న దేహాలు...కారే రక్తం...ఒక పిల్లవాడి చెవి విరిగి పడిపోయింది. ప్రేక్షకుల సైకిళ్ళు ఉక్కు మడమలకింద ధ్వంసమయ్యాయి. జననాట్య మండలి సభ్యుల్ని నేరుగా స్టేజిమీద అరెస్టుచేస్తే జనం ఊరుకోరనే భయంతో, ముందు జనాన్ని చావగొట్టి చెల్లా చెదురుచేసి కళాకారుల్ని జనంనుండి వేరుచేద్దామనుకున్నారు. కొన్ని వేల రూపాయల విలువైన మైకు సెట్, తెరలు ధ్వంసం చేశారు. మేకప్ రూములో ప్రవేశించి అక్కడవున్న జననాట్య మండలి కళాకారుడు, విరసం సభ్యుడు అయిన కా॥ భూపాల్‌ను, సంధ్య, నిమ్మి అరుణలను—బలంగా కొట్టారు. విరసం సభ్యుడు కా॥ రాంప్రసాద్‌ను చుట్టుముట్టి అతని గుండెలపై తుపాకి మోపికొట్టడం మొదలెట్టారు. అవి దెబ్బలుకావు. లాఠీల పోట్లవర్షం. నిమ్మిని తుపాకి మడమతో పొట్టలో పొడిచారు. నానా కారు కూతలు కూశారు. డప్పుల్నీ, డోలక్‌నీ ముక్కలు చేశారు. పట్టాభిపురం పోలీస్‌స్టేషన్‌కు పట్టుకుపోయారు. గుడ్డి వెలుతురులో పోలీసులు రాక్షసుల్లా పశువుల్లా ప్రవర్తించినతీరు ఇదీ. మిగిలిన జననాట్య మండలి కళాకారుల్ని, రాడికల్ యువజన సంఘ కార్యకర్తల్ని, యువజన సంఘం ఆహ్వాన సంఘం ఆఫీసులో 24 ఉదయం అరెస్టుచేశారు. ఆ ఆఫీసును అరెస్టు చెయ్యలేరు గనుక సర్వ నాశనం చేశారు. ఎలక్ట్రిక్ మీటర్‌ను పగులగొట్టారు. వైరింగు పీకివేశారు. మేకప్ బాక్సు చెడగొట్టారు. నిర్బంధితులను అరెస్టు మాత్రమే చెయ్యడంకాదు, కాళ్ళు చేతులూ విరిచి తుప్పబెట్టి వేనులలో తోయటం; ఒంటిపైని బట్టలు చించివేశారు. రిస్టువాచీని బూట్లతో తొక్కారు.

పోలీసుస్టేషన్...చుట్టూ యమభటులు...మధ్యలో 19 మంది నిర్బంధితులు. అందరిలో నుండీ రాంప్రసాదును వేరుచేసి ఏ అవయవమూ సరిగ్గా లేకుండా డి. ఐ. జి, యస్. పి. డి. యస్. పి. వంటి ఆఫీసర్లే స్వయంగా చావు దెబ్బలు కొడుతూంటే, ఎనిమిదేళ్ళ కళాకారిని విజయ వెక్కి వెక్కి ఏడవడం వింత కాదు. కానిస్టేబుల్సు కూడా కంట తడిపెట్టారు! రైఫిల్‌తో వీపున, మోకాళ్ళ మీద, మోగాళ్ళమీద, తోలు చిట్లేట్టు కొట్టారు. ఇది మన "ప్రజా స్వామిక" పోలీసు నాగరిక శక్తి!! ఫాసిజం అనాగరికం, అమానుషం లాంటి మాటలు తమ అర్థాలు అక్కడ కోల్పోయాయి!! ప్రదర్శనలో పాటల్ని టేప్ రికార్డు చెయ్యడమేగాక, పోలీసు స్టేషన్లో జాతీ రాజ్యంలో భీతావహ వాతావరణంలో కర్రలు పోతూంటే కొత్త కర్రలు పెట్టి కొడుతూ కళాకారుల చేత నృత్యం చేయించి పాటలు పాడించి టేప్‌రికార్డు చెయ్యడం పోలీసు అధికారుల విజ్ఞానస్థాయికీ కళాభిరుచికీ పరాకాష్ఠ!! పాడిన సంధ్య ఒంటి మీద ఎన్ని దెబ్బలో? దేహమే కుమిలిపోయింది. ఆడిన భూపాల్ వీపు చిట్లిపోగా, ఇప్పుడతను వెల్లకిలా పడుకోలేకపోతున్నాడు. సంధ్య ఎటూ ఒత్తిగిలి పడుకోలేకపోతున్నది. రాంప్రసాద్ మరొకరి ఆసరా లేకుండా అడుగు తీసి అడుగు వెయ్యలేకపోతున్నాడు. ఆ కామ్రేడ్ గాయాలు చీము కారి పోటెక్కుతున్నాయి! ఇదంతా ఏ చట్టంతో అనుమతింపబడిన అధికారమో పోలీసులకే తెలియాలి ఒక్క ఇందిరా ఇండియాలోనే ఇది సాధ్యం!

ఈ వరకే పార్వతీపురంలో జన నాట్య మండలిపై పెట్టిన రాజద్రోహ నేరం సరిపోయినట్టులేదు. మళ్ళీ ఇప్పుడు మరొక రాజద్రోహ నేరం! అవే పాటలు, ఆ కళాకారులే! ప్రాంతమే మార్పు! 124 ఎ, 120 బి, 505, సెక్షన్ల కింద తప్పుడు కేసు బనాయించారు. ఎక్కడివో కత్తులు తెచ్చి నిర్బంధితుల వద్ద పట్టుబడినవని అంటూ మోసపూరితంగా తమ కేసుకు సాక్ష్యం కల్పించుకుంటున్నారు.

"ప్రజాస్వామిక హక్కులు" అనబడే వాటి పోలీసుల చేతుల్లో రోజు రోజూ ఇలా ఘోరమైన మానభంగం జరుగుతూంది ఇప్పుడు కరాళ నృత్యం సాగిస్తూన్నది ఇందిరా ఫాసిజం. ఇది ఊర్థ్వా ప్రజాస్వామికమైనా కాదు. చివరకు విప్లవ రచయితల సంఘం, జన నాట్య మండలి వంటి సాహిత్య, సాంస్కృతిక సంస్థలమీదే ప్రభుత్వం ఎందుకింత దయచూపుతూందో తెలియదు.

ఎందుకంటే ఇలాంటి సాహిత్య సాంస్కృతిక సంస్థలు కూడ ఫాసిజాన్ని ఎదుర్కొంటూ జనతా ప్రజాస్వామిక విప్లవంలో సాంస్కృతిక సైన్యంగా పని చేస్తున్నాయి.

ప్రజాస్వామ్యవాదుల్లారా ! శ్రామికులారా ! రైతు కూలీ పేదలారా ! విద్యార్థులారా ! ఇది మన పోరాటం, ఏ నిర్బంధాలూ, రాజద్రోహనేరాలూ, కుట్రకేసులూ, హింసలూ, వధలూ, విప్లవాన్ని ఆపలేవు. పోరాడాల్సిన సమయం ఆసన్నమైంది.

గుంటూరు.
25-6-75.

—విరసం,
జన నాట్యమండలి, రాడికల్ యువజన ఆహ్వాన సంఘం, రాడికల్ స్టూడెంట్స్ యూనియన్,
పౌర హక్కుల సంఘం,
గుంటూరు.

---

[ఎమర్జెన్సీలో 'ఎన్‌కౌంటర్'ల పేరుతో హత్య చేయబడినవారు మన రాష్ట్రంలో 76 కాగా 'చట్టబద్ధం'గా హత్యచేయబడిన రాజకీయ ఖయిదీలు ఇద్దరు. ఎమర్జెన్సీ లేకపోతే భూమయ్య, కిష్టాగౌడులను ప్రజలు బతికించుకునేవారు అనడానికి అంతకుపూర్వం రెండుమార్లు వారి ఉరిశిక్ష అమలు జరుగకుండా ఆగిపోవడమే నిదర్శనం. అందుకే ఎమర్జెన్సీ చీకటిని ఆసరా చేసుకొని ఈ "భూమ్యాకాశాలను" ఉరితీసింది!- ఇందిరా వెంగళరావు పిరికి పాలన. ఆ రైతాంగ గెరిల్లాలకిదే జోహారు.]

# తిరుగుబాటు గెలుస్తుంది

— కాళోజీ

కిష్టగౌడు, భూమన్న
ఇద్దరేన దేశంలో ?
కిష్టగౌడు, భూమన్న
ఇద్దరేన లోకంలో ?
కిష్టగౌడు, భూమన్న
మొదటివార దేశంలో ?
కిష్టగౌడు, భూమన్న
ఆఖరోర లోకంలో ?

సంభవామి యుగే యుగే.
పుడుతారు క్షణక్షణం.
అన్యాయాన్నెదిరించె
అవగాహన, పట్టుదల
కలిగియున్న ప్రతి మనిషి
కిష్టగౌడె, భూమన్నె.

ఏకీభవించనోని
పీకనొక్కు సిద్ధాంతం
అంటే మరోటి కాదు-
అచ్చమైన ఫాసిజం-
అంతరించి పోవుదాక
కిష్టగౌడు, భూమన్నలు
తిరుగుబాటు మానధనులు
తలలెత్తుక తిరుగుతారు
అతికృత హింసను ఎదురగ
ప్రతి హింసను బూనుతారు
ఉరిత్రాళ్ళను త్రెంచుతారు
ఉద్రూతలు ఊగుతారు
హిరణ్యాక్ష సోదరులు
హిట్లర్లు ముసలీన్లు
వారి కొత్త ఎడిషన్లు
మటుమాయం అవుతాయి.

తిరుగుబాటు గెలుస్తుంది
సమవాదం మొలుస్తుంది
అరుణోదయ మవుతుంది
సామాన్యుని మేలుకొలుపు
తప్పకుండ జరుగుతుంది.
కిష్టగౌడు, భూమన్నల
కలలు నిజము అవుతాయి.

ప్రజల ప్రభుత వెలుస్తుంది
దోపిడి దౌర్జన్యాలు

దూపుమాసి పోతాయి.
సామాన్యుడు జాగ్రత్తతో
ఎప్పటికప్పుడు పంటకు
చీడపురుగు తేకుండ
కలుపు మొలిచి ఎదగకుండ
జాగ్రత్తగ బ్రతుకుతాడు.
విశ్వకుటుంబము నెలకొని
భూతల స్వర్గం వెలిసి
విశ్వశాంతి చేకూరగ
సమతాభావం మమతతో
బ్రతుకును సాగించుతాడు.

అందాకా నా గొడవే-
అన్యాయాన్నెదిరించు దే-
కిష్టగొడు భూమన్నల
ఒతవడిలో ప్రయత్నాలే-
ప్రయోగాలే.
తస్మాత్ జాగ్రత! జాగ్రత!

# స్మృతి గీతం

—"రుద్రజ్వాల"

[ నాటి తెలంగాణ పోరాట పతాకంమోస్తూ, ఎదురుకాల్పుల పేరపాల పద్రుతోపులో కట్టేసి కాల్చబడ్డ కస్తూరి కుటుంబరావు సజ్జా సూర్యబాలానందం, బండారు వెంకటేశ్వర్లు అరుణామర స్మతికి... ]

అన్నా ఓ కస్తూరీ!
అన్నా బాలానందం!
అన్నన్నా బండారూ!
ఇవే మీకు - ఇవే మీకు
జన గీతం జోతలు- ॥అన్నా॥

మగ్గాలకు చైతన్యం
'నాటీ' అందించారు.
మొగిలగుట్ట దొంకలకే
పాఠాలే నేర్పారు.
ఇసుక పర్రలకు కూడా
ఏరువాక పాడారు
సీకటి రాజ్జెం గుండెల
తుపాకులై పేలారు ॥అన్నా॥

లేనివాళ్ళ సేమంకై
కట్టాలో తడిశారు.
లేమిలేని రాజ్జెంకై
అసువులు అర్పించారు.
పాలపద్రు తోపుల్లో
ఒరిగిన సూర్యుళ్ళారా!
ఎదఎదలో చివురెత్తే
చిరజీవుల్లారా ॥అన్నా॥

ఈ నేలల చెరిగిన మీ
అశల నాగేటి సాళ్ళు-
ఈ నేలల చెదరిన మీ
ఆశయాల మళ్లూ-
ఎర్రకేతనం కిందే
పోరాటం పూతిస్తూ
రైతన్నలు, కూలన్నలు
ఎదిగిస్తూ నడిపిస్తరు- ॥అన్నా॥

# భారతీయ సంస్కృతిలో వర్గ దృక్పథం

—కొడవటిగంటి కుటుంబరావు

"మన సంస్కృతికి పునాదులు వైదికా సాహిత్యమేగదా?" అని ఎవరో అంటే నెహూ్రు, తనకు కొత్త విషయం తెలిసినట్టుగా ఆశ్చర్యపోయి, "అవును, నిజమే!" అన్నాడట. ఈ సంగతి నేను డాక్టర్ కేస్కర్ ద్వారా విన్నాను.

ఇంతకూ మన సంస్కృతి—లేదా, భారతీయ సంస్కృతి—అన్నది ఏమిటి? దాని విశిష్ట లక్షణాలేవి? అది భారతీయులందరికీ సమంగా ఉంటుందా? లేక, భారతదేశంలో అనేక సంస్కృతులు ఉన్నాయనుకుంటే అత్యధిక సంఖ్యాకుల సంస్కృతా? మన జాతీయ సంస్కృతా? మత సంస్కృతా? ఒకప్పుడు వుండినదా? లేక ఈనాడున్నదా? మహా నగరాలలో కనిపించేదా? పల్లెపట్టుల్లో కనిపించేదా? అడవుల్లో కనిపించేదా? (అటవికులుగా జీవించే భారతీయులు కూడా ఉన్నారు!) దక్షిణదేశంలో కనిపించేదా? ఉత్తర దేశంలో కనిపించేదా? ఇలా సవాలక్ష ప్రశ్నలు వెయ్యవచ్చు. అన్నిటికీ వేరు వేరు సమాధానాలు వస్తాయి.

ఏమైనా వేదవాఙ్మయం నుంచే మనకు సంస్కృతి దిగివచ్చిందని నెహూ్రును నమ్మించినవారు అబద్ధం ఆడలేదనటానికి సందేహం లేదు. ఆ మాట నిజమనుకోవడం నెహూ్రు అమాయకత్వాన్ని సూచిస్తుంది. ఎందుకంటే ఋగ్వేద కాలానికి పూర్వం సింధూలోయలో ఒక నాగరికత ఉండేది. అది వేదకాలపు ఆర్యులు ఎరిగినదానికన్నా గొప్ప నాగరికత. దాని ప్రభావం వేదకాలపు ఆర్యుల మీద ఉన్నదనటానికి సందేహం లేదు.

ఆర్యులలో వర్గాలున్నాయో లేదో తెలీదు. వేదకాలపు ఆర్యులు పశు పోషణ ప్రధాన వ్యాపకంగా కలవాళ్ళు. గోవులే వాళ్ళ ధనం. వాళ్ళ ఆలోచనలూ, పరిభాషా, సమస్తమూ గోవులను చుట్టి ఉండేవి. వాళ్ళలో కులాలు గోత్రాలనుబట్టి వుండేవి. అవి ఈ నాటి కులాలు కావు, ఎందుకంటే ఒక గోత్రం వాళ్ళ మధ్య వివాహం నిషిద్ధం. గోత్రం అంటే గోవుల కొట్టం. వాళ్ళు గోవుల కోసం యుద్ధాలు చేసేవాళ్లు. ఆ యుద్ధాలకు గవిష్టి అనే మాట వాడేవారు. గవిష్టి

అంటే గోవుల పీద వాంఛ. గోవులను గురించి మాట్లాడేటప్పుడు వాళ్ళకు కలిగే పారవశ్యం ఇంతా అంతా కాదు. అందుకు నిదర్శనాలు ఋగ్వేదంలోనే ఉన్నాయట. గౌతముడు అనే పేరు వేదకాలపు ఋషులలోనూ, ఉపనిషత్తులలోనూ చాలా తరచుగా కనిపిస్తుంది. అందుచేత వేదకాలపు ఆర్యుల జీవితం పూర్తిగా గోవులమయం. వారిలో వర్గాలూ, దోపిడీ ఉండే అవకాశం లేదు. వాళ్ళు అస్తమానమూ తిండి ధ్యాసతోనే కొట్టుకుపోయారు. తమ ఆహారాన్నీ, ధనాన్నీ (అంటే గోసంపదను) పెంపొందించాలని ఇంద్రుణ్ణీ, అగ్నినీ, వరుణుణ్ణీ, అర్థమైన వాళ్ళనూ స్తోత్రాలు చేశారు. అంతేగాక అన్నానికీ, ధనానికీ ఒకటేమాట-బ్రహ్మ-వాడారు. (అప్పట్లో బ్రిహ్మ అనే మాటకు మూడో అర్థం లేదు) ఈ దశలో వాళ్ల వర్గ దోపిడీని ఎరిగి ఉండటం అసంభవం.

ఈ ఆర్యులలో కొందరు క్షత్రియులుగా వ్యవహరించబడ్డారు. కొందరు యజ్ఞాలూ అవీ చేశారు. కానీ వాళ్ళు వేరే వేరే వర్గాలనుకోవటానికి ఆధారం లేదు. పురాణాలలో ఈ రెండురకాల ఆర్యులమధ్య వివాహాలుజరిగినట్లు సాక్ష్యం ఉన్నది. విశ్వామిత్రుడు క్షత్రియుడన్నారు. విశ్వామిత్రుడనేవాడు వేదకాలపు ఋషి కూడాను. ఆయన యుద్ధాలు చేసినట్టు సాక్ష్యంలేదు. పురాణాలు ఒక విశ్వామిత్రుణ్ణి రాజర్షి చేశాయి.

వేదకాలపు ఆర్యుల పరిస్థితి ఇలా ఉంటే, మొహంజదారో, హరప్పా నాగరికతలకు కారకులైన వారిలో కనీసం మూడు వర్గాలుండేవని పురాతత్వ వేత్తలు అంచనా కడుతున్నారు. నాగరికత వెంబడి వర్గ విభజన విధిగా ఉంటుదన్న సంగతి అలా ఉంచి, ఆ శిథిల నగరాలలో బయటపడిన ఇళ్లు అన్నీ ఒకే స్థాయిలో జీవించినవారివి కావు. కుల విభేదాలూ, దోపిడీ అనేవి మనకు ఆర్యులనుంచి వచ్చాయనుకునేకన్నా, వాటిని వేదకాలపు ఆర్యులు తమకు పూర్వం ఉండిన నాగరికత నుంచి అరువు తెచ్చుకుని, మనకు సంక్రమింప చేశారనుకోవడం సమంజసంగా కనబడుతుంది.

వేదకాలపు ఆర్యులపై అనార్యుల ప్రభావం, ముఖ్యంగా ద్రావిడ సంస్కృతి ప్రభావం ఉండిందనటానికి కొన్ని కారణాలు ఇతర మైనవికూడా విజ్ఞులు చెబుతున్నారు. ద్రావిడ ధాతువుల నుంచి ఏర్పడిన మాటలు కొన్ని సంస్కృతంలో ప్రవేశించాయి. క్రీస్తు పూర్వం 1000కి, 500కూ మధ్యలో ఇది జరిగిందట. ఇది ఉత్తర వేదకాలం. ఈ కాలంలో ద్రావిడ పదాలు ఋగ్వేదంలో ప్రవేశించాయి.

వీటిలో కొన్ని వ్యవసాయ సంబంధమైనవి. సింధు నాగరికతలో వ్యవసాయం చాలా వృద్ధి చెందింది గనుకనూ, ఆర్యులకు వ్యవసాయం ముఖ్యమైనది కాదు గనుకనూ, అలాంటి పదాలు అనార్యుల సంపర్కం వల్లనే సంస్కృతంలో ప్రవేశించాయను కోవాలి.

ఇలాటి కారణాలను బట్టి మనం భారతీయ సంస్కృతి అనేది వేదకాలపు ఆర్యుల సంస్కృతి అనుకునే అవకాశం లేదు. వేదకాలం ముగియక ముందే ఆర్యులు అనార్యుల సంస్కృతికి గురి అవుతూ వచ్చారు.

ఆ సంకర సంస్కృతి అయినా నిలిచి ఉండలేదు. అది వేదకాలం లోనే —అంటే వేదాల సృష్టి పూర్తి కాకముందే - అనేక రకాల పరిణామానికి గురి అయింది. అందుకు కారణం అనేక భౌతిక కారణాలు. ఋగ్వేద రచన అనేక శతాబ్దాల మీద జరిగింది. అంత కాలమూ ఆర్యుల జీవితం స్తంభించి ఉండలేదు. క్రమంగా వ్యవసాయానికి ప్రాముఖ్యం హెచ్చింది. స్థల చలనం కూడా వాళ్ళను ప్రభావితులను చేసి ఉండాలి. ఋగ్వేద రచన చాలా వరకు సింధూ నదీ ప్రాంతంలో జరిగిన, కొద్ది భాగం గంగా ప్రాంతంలో కూడా జరిగింది.

వేదకాలపు ఆర్య సమాజంలో కలిగిన మార్పులకు కారణభూతాలైన భౌతిక కారణాలు ఏవైనా, వాటి ఫలితాలు స్పష్టంగా కనిపిస్తాయి. ఋగ్వేదంలో ఎక్కడా లేని చాతుర్వర్ణం దాని చివరలో కనిపిస్తుంది. ఆరంభంలో గౌరవ వాచకంగా ఉండిన "అసురా!" అన్న సంబోధన నిందా వాచకంగా పరిణమించింది. అన్నిటికన్న విచిత్రం ఏమిటంటే, వేదకాలపు ఆర్యుల ఇష్టదైవమైన ఇంద్రుడు వేదంలో కొంత భాగాన్ని నాశనం చేశాడు; అంటే ఋగ్వేదంలో కొంత భాగం ఋగ్వేద కాలపు ఆర్యులకే పనికి రాకుండా పోయింది. దీన్నిబట్టి ఆ కాలపు ఆర్యుల జీవితంలో ఎలాంటి పరిణామాలు జరిగాయో ఊహించవచ్చు.

వేదకాలపు ఆర్యుల జీవితానికి ఒకే ఒక ఆధారం - వాళ్ళ జీవిత విధానం — యజ్ఞం. వాళ్ళకు కావలసినసంపదను సృష్టించటమూ, పెంచడమూ, పంచుకోవడమూ, అనుభవించడమూ మొత్తం అంతా యజ్ఞమే. ఈ యజ్ఞంలో ప్రముఖ పాత్ర నిర్వహించిన వాళ్ళే వాళ్ళ దేవతలు - మిత్రుడు, వరుణుడూ, ఇంద్రుడూ, అగ్ని, అశ్వినులూ వగైరా వగైరా.

ఈ యజ్ఞం కూడ మారింది. ఆదికాలంలో సమిష్టిగా జరిగిన ఈ యజ్ఞం పిదపకాలంలో వ్యష్టిగా జరిగింది. యజమానులు కాస్త యజమానుడయాడు. "మనం" పోయి దాని స్థానంలో "నేను" వచ్చింది. భాగదేయాన్ని అందరితో పాటు పుచ్చుకున్న ఇంద్రుడూ తనకు హెచ్చు భాగం రావాలని డిమాండు చేశాడు. ఆదిమ సమ సమాజంలో వర్గ వ్యత్యాసాలు ఆరంభమయాయి. దీన్ని బట్టి వేదకాలపు ఆర్యుల ఉత్పత్తి శక్తులు పెరిగాయనీ, దోచుకునే వాళ్ళూ, దోచుకోబడేవాళ్ళూ వేరువేరుగా విడి పోయారనీ తెలుస్తుంది.

ఈ వర్గ విభజనే వర్గ వ్యవస్థకు దారి తీసింది. వర్గ పీడన అతిదారుణ మైన స్వరూపంలో అవతరించింది. వేదకాలపు ఆర్యుల దృష్టిలో అతి హీనంగా పరిగణించబడిన వ్యవసాయమూ, శరీర శ్రమతో కూడిన పశుపోషణా వైశ్యులకు అంటగట్టారు. శూద్రులు అగ్రవర్ణాలకు వెట్టిచాకిరీ చేసేటందుకు నియోగించబడ్డారు. వాళ్ళు ఆర్య సమాజపు బానిసలు. వైశ్యుణ్ణి సాధ్యమైనంతగా పిండవచ్చుననీ, శూద్రుణ్ణి యిష్టం వచ్చినట్టు హింసించి చంపినా పాపం లేదని బ్రాహ్మణ ధర్మశాస్త్రాలు ప్రవచించాయి.

సంపదను ఉత్పత్తి చేసే ఈ రెండువర్గాల పట్లా బ్రాహ్మణ క్షత్రియ వర్గాలు ఇంత కౌర్యం చూపటానికి కారణం ఏమిటి? దానికి సమర్థింపు ఏమిటి? వాళ్ళు శరీరశ్రమ చేసేవాళ్ళు. శరీరశ్రమ హీనమైనదనీ, బుద్ధి శ్రమే ఘనమైనదనీ బ్రాహ్మణులు చెప్పారు.

బుద్ధి శ్రమతో బ్రాహ్మణులు సాధించినదేమంటే, ఆధ్యాత్మిక దృక్పథం ఈ ఆధ్యాత్మిక వాదం వర్గపీడనకు చాలా ఉపకరించింది స్వర్గమూ, నరకమూ, పుణ్యపాపాలూ, విధీ కర్మసిద్ధాంతమూ, మాయావాదమూ ధర్మాధర్మ నిరూపణా వర్గ దోపిడీకి బాగా వినియోగించాయి.

వర్గ సామరస్యం అన్న నినాదం ఈనాడు వర్గదోపిడీకి ఎలా ఉపయోగించిందీ మనకు తెలుసు. కాని ఆ కాలంలో బ్రాహ్మణ క్షత్రియ వర్గాల వాళ్ళ సామరస్యం ద్వారా మిగిలిన రెండు వర్గాలనూ పీల్చి పిప్పి చెయ్యటమేగాక, ఆనాటి సమాజాన్ని బలమైన గొలుసులతో బంధించి, ఆ దోపిడీని చిరస్థాయిగా ఉంచటానికి అంతులేని కర్మకాండ సృష్టించారు.

అయితే సమాజం మారకుండా ఉండదు. ధర్మశాస్త్రాలు సామాజిక పరిణామాన్ని ఆపలేవు. సమాజానికంతకూ ఒకే ధర్మం చెబుతున్నట్టు ధర్మక

శాస్త్రాలు ఏనాడూ సహించను కూడా లేదు. వర్ణ ధర్మాలు ఆరంభం నుంచీ వేరు వేరుగానే ఉండేవి బ్రహ్మహత్య మహాపాతకం. క్షత్రియులను క్షత్రియులు చంపుకుంటే వీర స్వర్గం మిగిలిన కులాలను చంపినా దోషం లేదు. వర్ణ వివక్షత రూపంలో వర్గ వివక్షత ధర్మ శాస్త్రం నిండా ఉన్నది.

ఈ వర్ణ వివక్షత స్త్రీలకు కూడా వర్తించింది. వాళ్ల దాదాపు శూద్రులే ఏ వర్ణానికి చెందిన స్త్రీ అయినప్పటికీ శూద్రులలాగే చూడబడింది. ఆమె వేదాధ్యయనం చెయ్యరాదు భర్తతోపాటు చచ్చిపోవాలి. లేదా, చచ్చినదానిలా పడి ఉండాలి

కాని ఈ ధర్మశాస్త్రాలైనా సమాజమంతటా ఒకే రకంగా అమలు జరగ లేదు. ప్రాంతీయమైన ఆచార వ్యవహారాలకు ఆదరం లభించింది. ఉత్తరదేశంలో మేనరికాలు నిషిద్ధమైతే, దక్షిణాన ధర్మ సమ్మతం. మనుస్మృతి లాటివి పుట్టే నాటికే ఈ దేశం ఒకే విధమైన జీవిత విధానానికి అతీతమై పోయింది.

వైదిక సంస్కృతి పోయింది. వర్ణాశ్రమ ధర్మాలు పోయాయి. బ్రాహ్మణులు వర్తకాలు చేశారు, యుద్ధాలు చేశారు, సేనాపతులూ, మంత్రులూ అయారు. తాము రాజులను చంపి రాజవంశాలు కూడా స్థాపించారు. పౌరోహిత్యం చేసుకు బతికినవాళ్లు బహు కొద్ది మంది. బ్రాహ్మణులంతా ఒక వర్గంగా దోపిడీద్వారా సుఖపడినరోజులు ఉపనిషత్తుల కాలానికే పోయాయి వారిలో కటిక దారిద్ర్యం అనుభవించినవారున్నారనటానికి శునశ్శేపుడి కథే ఆధారం. అతన్ని తండ్రి నూరు గోవులకు యజ్ఞపశువుగా హరిశ్చంద్రుడికి అమ్మాడు మరో నూరు గోవులు పుచ్చుకొని తన కొడుకును యూపస్తంభానికి కట్టాడు. మరొక నూరు గోవులిస్తే వాణ్ణి చంపటానికి కూడా సిద్ధపడ్డాడు. ఉపనిషత్తులలో ఉండే ఈ కథలో విశేషమేమంటే ఈనరమేధం చేయించే హరిశ్చంద్రుడి వద్ద వేలకొద్దీ గోవులుండి ఉండాలి యాజమానులు నరపశువును యూపస్తంభానికి కట్టటానికీ నరకటానికీ నిరాకరించారు, కాని యజ్ఞం చేయించటానికి వెనకాడలేదు, వాళ్ళు రాజు ఇచ్చే దక్షిణతో తృప్తి పడే మధ్య తరగతి వాళ్లు. తన కొడుకును యజ్ఞపశువుగా అమ్మటానికి సిద్ధపడినవాడు కటిక దరిద్రుడు।

దీన్నిబట్టి ఏం తెలుస్తుంది? ఉపనిషత్తుల కాలానికే – ఇంకా ముందే కూడా; ఎందుకంటే ఇది అప్పటికే పూర్వ కథ – వర్ణ వ్యవస్థకు అడ్డంగా

వర్గ వ్యవస్థ ఏర్పడి పోయింది. వర్ణాలు వర్గాలు కాకుండా పోయాయి. ఆ దశలో వర్ణ వ్యవస్థ రద్దు అయి ఉంటే సమాజంలో ఉండే వర్గాల స్వభావం ప్రస్ఫుటంగా కనబడి ఉండేది. కాని వర్ణ వ్యవస్థ పోలేదు. అది వర్గాలకు అడ్డు తెరగా నిలిచింది.

కనీసం వర్ణ ధర్మాలన్నా నిలబడి ఉంటే వర్ణ వ్యవస్థకు కొంత అర్థం ఉండేది. చేతనైన బ్రాహ్మణులు రాజులూ, మంత్రులూ, సేనానులూ, సామంతులూ కాగా, అడుక్కు తినేవాళ్ళు అడుక్కు తినగా, యజ్ఞకర్మలతో పొట్ట పోసుకునే పరిస్థితి వెనకబడి, మధ్యతరగతి బ్రాహ్మణులు వందిమాగధులూ, వడ్రంగులూ, విలుకాళ్లూ, శిల్పులూ, జ్యోతిష్కులూ, వైద్యులూ అయారు. ఒకప్పుడు వైదిక వాఙ్మయాన్ని బ్రాహ్మణులు రహస్యంగా ఉంచినట్టే-ఉపనిషత్తులంటే రహస్య జ్ఞానం। - ఇప్పుడు బ్రాహ్మణులు తాము సంపాదించిన శాస్త్రజ్ఞానాన్ని రహస్యంగా ఉంచి, బాగుపడటానికి యత్నించారు.

దీనితోబాటు బ్రాహ్మణత్వం ఇంకొక సాంఘిక పాత్ర నిర్వహించింది రాజులు తమ రాజ్యాలను విస్తరించుకునే ప్రయత్నంలో వేరు వేరు జాతుల, వాళ్ళను జయించినప్పుడు, ఆ జాతులలో ఏనాడూ లేని వర్ణ వ్యవస్థను ఏర్పాటు చేసి, వాళ్ళ నాయకులను రాజులను చేసి, వారికి క్షత్రియత్వమూ, గోత్రాలూ అంటగట్టి సమిష్టి జాతి సంపదను ఆ రాజు యొక్క సొంత ఆస్తిని చేసి, వారికి కర్మకాండను జరపటానికి ఆ జాతి వారినే బ్రాహ్మణులుగా తరిఫీదు చెయ్యటం జరిగింది. ఆ విధంగా ఏర్పడిన వాతే కోయ బ్రాహ్మణులూ, ఆ భీల బ్రాహ్మణులూ మొదలైన వాళ్లు. ఈనాడు విశ్వబ్రాహ్మణులయి కూడా పౌరోహిత్యం చేసే బ్రాహ్మణులు విరిగా ఉన్నారు.

ఇదొక బ్రాహ్మణ మతంగా రూపొంది, దేశమంతటా విస్తరించింది. ఒక ప్రాంతపు బ్రాహ్మణులను మరొక ప్రాంతం వారు తక్కువచేసి చూశారంటే, "జన్మనా జాయతే శూద్రః, కర్మణా జాయతే బుధః" అన్నది అక్షరాలా నిజమయింది. అంటే, శూద్రులుగా ఉండవలిసినవాళ్లు కర్మకాండ నేర్చుకుని బ్రాహ్మణులుగా వ్యవహరించారు. ఒకడు జన్మతః బ్రాహ్మణుడని చెప్పటానికి లేకుండాపోయింది ఇది రాజుల అభ్యుదయానికి తోడ్పడిందేమోగాని, వర్ణ ధర్మం నిలబడటానికి తోడ్పడలేదు. జాతులవాళ్ళను 'ఆర్య' సమాజాలుగా మార్చినప్పుడు, వాళ్ళు తమ పాత ఆచారాలను, పాత దేవుళ్ళనూ, దేవతలనూ,

జాతరలనూ మానుకోలేదు ఆ కారణంచేత వేద విరుద్ధమయిన అనేక ఆచారాలు 'హిందూ సమాజం' అనే దానిలో ప్రవేశించాయి. అనార్య దేవతలను అర్చించటానికి సంస్కృత మంత్రాలు సృష్టి అయాయి. కొందరు దేవతలపేర కొత్తగా పురాణాలు అవతరించాయి.

బ్రాహ్మణుల స్థితి ఇలా ఉంటే, క్షత్రియ వర్ణం స్థితికూడా ఇలాగే ఉన్నది. వేదకాలంలో క్షత్రియులంటే అందరినీ 'రాజన్' అన్నారోలేదో తెలీదు. బుద్ధుడి కాలంలో శాక్యులూ, లిచ్ఛవులూ మొదలైన జాతులవాళ్ళు తాము క్షత్రియులమని చెప్పుకోవటమేగాక, క్షత్రియులది అగ్రవర్ణమనీ, బ్రాహ్మణులు తమ తరువాత వర్ణమనీ చెప్పుకున్నారు వాళ్లు ప్రధానంగా వ్యవసాయం చేశారు. వర్ణాశ్రమ ధర్మాల ప్రకారం అది వైశ్యులపని. వాళ్ళది సమిష్టి జీవనం. వాళ్ళవి గణతంత్ర రాజ్యాలు. అలాంటి సమాజాలను వర్ణ ధర్మాలు- బ్రాహ్మణులు కల్పించినవి-ఉన్నట్టు కనబడదు.

ఏమైనా, నందహంశం నుంచీ క్షత్రియులు లేరనే వానుడి ఉన్నది. అయినా అటుతరువాత క్షత్రియ వంశాలు ఎక్కువయాయిగాని, అంతరించిపోలేదు. ఇందుకు కారణం, రాజ్యాలు ఏలినవారందరూ బ్రాహ్మణుల చేత అబద్ధపు వంశ వృక్షాలు తయారుచేయించుకుని, సూర్యవంశానికో, చంద్రవంశానికో చెందినవాళ్ళ మని చెప్పుకున్నారు. ఇది బ్రాహ్మణులు 'క్షత్రియ' కులానికి చేసిన నిర్వాహకం. మన ఎరుకలో, శూద్రుడైన శివాజీ పట్టాభిషేకానికి అర్హుడు కావాటానికి ఒకబ్రాహ్మడిచేత తమది క్షత్రియ వంశమని శిలాలు పొందాడు. ఆ బ్రాహ్మడు మహారాష్ట్రుడైనా కాదు, కాశీవాడు.

పురాణాలలో చెప్పిన పరశురాముడి కథ నిజమైతే అది వాస్తవమయిన వర్గ కలహం అయిఉండొచ్చుగాని, చరిత్రకాలంలో మటుకు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనేవారు వేరు వేరు వర్గాలు కారు. బుద్ధుడి కాలంనాటికే వైశ్యులు వర్తక వాణిజ్యాలు చేస్తున్నారు. కర్షక గ్రామాలలో శూద్ర కుటుంబాలను స్థాపన చేస్తున్నారు రాజ్యాల విస్తరణలో వేల సంఖ్యలో గ్రామాలు వెలిశాయి వాటి పంపిణీ అంతా పాలకులకు అనుకూలంగా బ్రాహ్మణులు నిర్ణయించినది. బ్రాహ్మణుల సంపర్కం లేని జాతులు శూద్రులుగా దిగబడిపోతే, అవే జాతులు బ్రాహ్మణ సంపర్కంతో పై వర్గాలుగా చలామణీ అయాయి. అలా

శూద్రులై పోయిన వాళ్ళు అభీరులు ఆదిలో క్షత్రియులైన కిరాతులకు అదే గతి పట్టింది. పుండ్ర, మాగధ జాతులు శూద్రులై పోయారు

వర్ణ వ్యవస్థకు ఎలాటి అర్థమూ, ఎలాటి భౌతికమయిన ఆధారమూ లేకుండా పోయినాకకూడా ఈ వ్యవస్థ కొనసాగింది. వివిధ వృత్తులను బట్టి కులాలు ఏర్పడ్డాయి. సమాజంలో చేరిన కొన్ని జాతులకు కులాల ప్రతిపత్తి లభించింది. గొల్లజాతి అలాటిదే. యాదవుడైన కృష్ణుడు కొంతకాలం గోపుల మధ్య పెరిగిన కారణంగా గొల్లలు యాదవులమని చెప్పుకుంటున్నారు.

అయితే కుల వృత్తులు తారుమారయాయి. కొన్ని వృత్తులు పోయాయి కొత్త వృత్తులు వచ్చాయి. కులపరంపరగా ఈ వృత్తులు సాగటం మానిన అనంతరం కులవ్యవస్థకు కూడా అర్థం లేకుండా పోయింది. ఆదిలో వర్ణ వ్యవస్థకు ఉండిన అర్థం తరవాత తరవాత కులవ్యవస్థకు లేకుండా పోయింది. అందుకు కారణం కులాలు వర్గాలు కాకపోవడమే.

కులవ్యవస్థకే అర్థం లేకుండా పోయినా కూడా వర్గాల దుర్గంధం పోలేదు. అసంఖ్యాకమైన కులవృత్తులు చేసుకునేవాళ్ళు, అంటే ఉత్పత్తి కోసం శ్రమించే వాళ్ళు, శూద్రులకింద జమ అయిపోయి, దోపిడీకి గురి అవుతూ వచ్చారు, ఇంకా గురి అవుతున్నారు.

వేదకాలపు ఆర్యులకు ఒకమతం అంటూ ఉన్నా లేకపోయినా, అనంతర కాలంలో మతంగా వ్యాప్తిలోకి వచ్చినది బ్రాహ్మణమతం. అదే హిందూమతంగా చలామణి అయింది దీనికి ఆధారం ఆధ్యాత్మికవాదం ఆచరణలో అది బ్రాహ్మణులు సృష్టించిన ఆచారాలు. అయితే ఇతర మతాలు దీని మీద పోటీగా వచ్చాయి. బ్రాహ్మణమతంమీద తీవ్రంగా పోటీ చేసినది బౌద్ధం, కొంతవరకు జైనం. ఈ రెండుకూడా కులవ్యవస్థ ఎరగని గణతంత్ర జీవితంనుంచి పుట్టినవే. అయితే, బౌద్ధం వర్ణ వ్యవస్థను ఆమోదించకపోయినా దాన్ని తీవ్రంగా ప్రతిఘటించలేదు. వర్గ వ్యవస్థకు ఆస్కారంలేని కారణంచేతనే బౌద్ధం ఈ దేశంలోకన్న ఇతర దేశాలలో విజయవంతంగా వ్యాపించిందంటారు జైనం వర్ణవ్యవస్థను ఆమోదించి కొంతవరకు నిలవగలిగింది.

ఇలాగే శైవం, వైష్ణవం, సిక్కుమతం తదితర సవాలక్ష మతాలు వర్ణ వ్యవస్థను తీవ్రంగా ప్రతిఘటించక, హిందూ సమాజంలో ఇమడగలిగాయి.

కొన్ని మతాలవాళ్లు ఒక ప్రత్యేక సంఘంగా నిలవగలిగితే, మరి కొన్ని చిల్లర మతాలవాళ్లు హిందూసమాజంలో ప్రత్యేక కులాలుగాచేరిపోయారు అన్నిరకాల కులాలనూ-వృత్తినిబట్టి ఏర్పడిన వాటినీ, మతాచారాలనుబట్టి ఏర్పడిన వాటినీ వర్గం అనేది చీల్చిపారేసింది.

వర్గం అనేది సమాజంలో దోపిడీ విధానంలో మనుషులు నిర్వహించే పాత్రనుబట్టి ఏర్పడుతుంది. ఉత్పత్తి చేసేటందుకు శ్రమించేవాళ్ళూ, ఆ ఉత్పత్తిలో హెచ్చు భాగం దోచుకునేవాళ్ళూ ఈ దోపిడీ విధానంలో దోపిడీదార్లకు సహాయకులుగా ఉంటూ దోపిడీలో "నక్కవాటా" పుచ్చుకునే వాళ్ళూ, సామాజిక దోపిడీకి అనుకూలించే సిద్ధాంత సూత్రాలకు ప్రచారం ఇచ్చేవాళ్ళూ వేరువేరు వర్గాలుగా ఉంటారు. అన్ని వర్గసమాజాలలోనూ అల్ప సంఖ్యాకులు అధిక సంఖ్యాకుల శ్రమశక్తితో జరిగే ఉత్పత్తిని కొల్లగొట్టుతారు. అయితే ఈ దోపిడీ వెనక ఒక సాంస్కృతిక తెర ఉంటే గాని నాటకం సాగదు. దాన్ని రమ్యంగా రంగురంగులతో తయారుచేసేవాళ్ళు కావాలి. నాటకంలో ఘట్టాలు మారినప్పుడల్లా ఈ తెరలు మారుతూంటాయి. చిన్నపిల్లల కథల వెంట ఉండే బొమ్మలు కథకు జీవంపోసినట్టు, ఈ తెరలు నాటక ఘట్టాలను ఆమోదకరంగా చేస్తుంటాయి.

ఉదాహరణకు: "ఆడది మహా పాపాత్మురాలు. మాయావిని, దాన్ని చెప్పుకింది తేలులా ఉంచాలి. దాన్ని ఎంతమాత్రమూ నమ్మరాదు" అన్న సాంస్కృతిక భావం తెరగా కట్టి చచ్చిన మొగుడితో బతికున్న పెళ్లాన్ని తగలేసి, దానికి ఉత్తమలోకాలు కలిగాయని జనాన్ని నమ్మించవచ్చు. అదొక సాంస్కృతిక దశ. ఈ సంస్కృతిలో చిన్న అభివృద్ధివస్తుంది. అప్పుడు మొగుడు చచ్చినదాన్ని తగులబెట్టే "దురాచారం" పోయి, దానికి గుండు కొట్టించి, అలంకరణలన్నీ తీసేసి, ఒంటిపూట తిండిపెట్టి, వెట్టిచాకిరీ చేయించే "సదాచారం" అమలులోకి వస్తుంది. మానవత పెంపొందుతుంది: దీన్ని క్షుద్రమైన సాంస్కృతిక వికసనం అంటారు. వర్గ సమాజంలో జరిగే సాంస్కృతిక వికసనం అంతా ఇలాగే ఉంటుంది. వీటినే సంస్కరణలు అంటారు.

సాధారణంగా ఈ సంస్కరణలు, అమలు జరగటమూటూ ఉంటే, కాలాతీతంగానే అమలు జరుగుతాయి. అవసరమైనదానికన్న కొన్ని దశాబ్దాలూ, శతాబ్దాలూ వాయిదాపడి మరీ జరుగుతాయి. కాని, సమాజంలో చలామణీలో

ఉంటే ఆర్థిక దోపిడీకు వ్యతిరేకంగా ఉండే పక్షంలో ఈ సంస్కరణలే తీవ్ర ప్రతిఘటనను ఎదుర్కొంటాయి. అటువంటి ప్రతిఘటనలను ఎదుర్కొని సంస్కరణ భావాలను ప్రచారం చేసినవాళ్ళు మహా పురుషులనిపించుకుంటారే గాని, వాళ్ళు సామాజిక దోపిడీని అరికట్టలేరు.

ఈనాడు మనం భారతీయ సంస్కృతి అనేది మిశ్రమ సంస్కృతి. ఇందులో ఆదిమవాసుల ఆచారాలు మొదలుకొని విమానయానాలదాకా సమస్తమూ ఉన్నది. భౌతికవాదంతో ఆధ్యాత్మికవాదాలూ, వర్గతత్వంతో కులతత్వమూ పెనవేసుకుపోయి ఉన్నాయి. ప్రగతి అనేది కేవలము భౌతిక రూపంలో సాధించవలసి ఉండగా, అందుకవసరమైన భావ చైతన్యం లోపించినప్పుడు ప్రగతి సాధ్యం కాదు. మందులతో నయమయే రోగానికి భూతవైద్యం చేయించుకునేవాడు రోగం నయం చేసుకోలేడు. ఈ నాడు మన ప్రభుత్వం దారిద్ర్యాన్ని అరికట్టటానికి చేసే ప్రయత్నాలు ఎంత అసంబద్ధంగా ఉంటున్నాయో, భారతీయ సంస్కృతి అనేది దేశప్రగతికి అంత అననుకూలంగా ఉంటున్నది. అందుకే అలెగ్జాండరు దండయాత్రల కాలంనుంచి కూడా ఎవరుపడితే వాళ్ళు జయించటానికి అనువుగా ఉంటూ వచ్చింది.

బలమైన సంస్కృతి, దానికి అనుగుణమైన సామాజికజీవితమూగల జాతి తేలికగా ఇతర సంస్కృతులను అంది పుచ్చుకోదు. మ్యూజియంలాంటి మన భారతీయ సంస్కృతిలో అన్ని జాతుల సంస్కృతికీ చోటున్నది. బ్రిటీషువాళ్ళ కాలంలోనూ, అంతకుముందు మహమ్మదీయుల కాలంలోనూ, ఇంకా ముందు గ్రీకులనుంచి కూడా మనవాళ్ళు దొరికినదంతా అందిపుచ్చుకున్నారు. అదంతా మనకూ, మన ప్రగతికీ ఏ విధంగా పనికి వస్తుందన్న ఆలోచనలేదు.

ఈ నాడు కూడా భారతీయ సంస్కృతిలో వైవిధ్యం పట్టణాలకూ పల్లెలకూ మధ్య కనిపించినంతగా వర్గాలమధ్య కనిపించదు. వర్గ సంస్కృతి విషయంలో ఈ దేశం చాలా వెనకపడి ఉన్నది. కులం అన్నది ధనానికీ, పదవులకూ, పైకివచ్చే అవకాశాలకూ ఆధారంగా ఉండటం ఈ పాతికేళ్ళలో బాగా విజృంభించిన కారణంగా కులతత్వం పెరిగింది. ఇది వర్గ దృక్పథాన్ని నీరుగారుస్తుంది.

సరి అయిన వర్గ చైతన్యం దోపిడీ చేయగల వర్గానికే పరిమితమై ఉన్నది. వాళ్ళ జాతీయ సంస్కృతిని-బహుళాకృతులద్వారా కానియ్యండి, ధన

సహాయంద్వారా కానియ్యండి నిషేధాలద్వారా కానియ్యండి, మేధావుల అరెస్టుల ద్వారా కానియ్యండి-శాసించినంత కాలము, ప్రగతికి పనికి వచ్చే సంస్కృతి ముందుకు రాదు. ఈ పరిస్థితిలో అట్టడుగు నుంచి సంస్కృతి బయలుదేరి, పోరాడుతూ పైకి రావాలి. అలా రావలసినది విప్లవ సంస్కృతి. దేశంలోని అత్యధిక సంఖ్యాకుల సంస్కృతి. విప్లవ సంస్కృతి తెర మీద విప్లవ నాటకం ఆడాలి దోపిడీ సంస్కృతికి సంబంధించిన తెరలన్నీ చించి పారెయ్యాలి కొంత విధ్వంసం జరగకుండా నూతన సృష్టి సాధ్యం కాదు.

దోపిడీ వర్గాలు తమ మంత్రిత్వ శాఖలద్వారానూ, ప్రయాణ సౌకర్యాల ద్వారానూ, రేడియో వగైరాల ద్వారానూ, మత మౌఢ్యాన్ని అపారంగా పెంచుతున్నాయి. ఎన్నికలూ, నిమ్న జాతులకిచ్చే సౌకర్యాలూ కులవ్యవస్థను పటిష్ఠం చేస్తున్నాయి. సినిమాలు సైతం ప్రజల మనస్సులను వర్గ సంస్కృతి నుంచి వేరుచేయడానికి శాయశక్తులా కృషిచేస్తున్నాయి. కనీసం మన గతాన్ని గురించి కూడా మనకు నిజం తెలియకుండా అబద్ధాలు చెప్పారు. అది కూడా పైవాళ్లు చెప్పినదే మనం విన్నాం. మాక్స్‌ముల్లర్ మనది నిశరమైన ఆధ్యాత్మిక దృక్పథం అంటే నిజమేననుకుని పొంగి పోయాం. ఒక వంక మనని పాశ్చాత్య దేశాలు దోచుకుంటూ ఉంటే, మనం మన ఆధ్యాత్మిక బలంతో ప్రపంచాన్ని జయిస్తామని వివేకానందుడు కలలు గన్నాడు.

తిరుగుబాటు ఉద్యమాలు వచ్చాయి. బ్రాహ్మణ వ్యతిరేకోద్యమమూ, నాస్తిక ప్రచారాలూ, పురాణాలదహనమూలాంటివి ప్రోలిటేరియన్ సంస్కృతిలో ఒక భాగంగా కొనసాగలేదు. ఇలాంటి తిరుగుబాట్లు వర్గ దృక్పథంతో కూడినవి కానందున సంస్కరణ యత్నాలుగా ఉండిపోయాయి.

ఇప్పుడు పీడిత వర్గ సంస్కృతి ఎంతైనా అవసరం. దానికి విరుద్ధంగా ఉండే సంస్కృతిని పూర్తిగా నరికి పారెయ్యాలి. అందుకు మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానం తప్ప మరో సాధనం లేదు. ఇది నూరేళ్ళ కాలంలో చక్కగా పదునెక్కింది. ఇది హైడ్రోజన్ బాంబులను మించిన పరికరం. ఇదే ప్రపంచ మంతటా ఒక నూతన యుగాన్ని స్థాపించగలదు. భారతీయ సంస్కృతి చలామణి అవుతున్న ఊబికారణ్యం పోయి, ప్రోలిటేరియన్ సంస్కృతి అనే నందనవనం రావాలి.

# చెరగని చిరునవ్వు - చెదరని గుండె ధైర్యం

# కామ్రేడ్ పరిటాల శ్రీరాములు

—కాశీపతి

కామ్రేడ్ పరిటాల శ్రీరాములు విరసం కార్యవర్గ సభ్యుడు. ఆ మాత్రమే చెప్పితే ఆయన చరిత్ర చిత్రణను సంపూర్తిగా యిచ్చినట్టుకాదు కామ్రేడ్ శ్రీరాములు విప్లవ పోరాటయోధుడు

విప్లవ కవిగా కంటే కామ్రేడ్ శ్రీరాములు విప్లవకారుడిగానే అశేష ప్రజా నీకానికి పరిచయం. అనంతపురం జిల్లా ధర్మవరం తాలూకాలో ప్రజాసమస్య లున్న ప్రతిచోట శ్రీరాములున్నాడు. శ్రీరాములున్న ప్రతిచోట భూస్వామ్య వ్యతిరేక రైతాంగ పోరాటాలున్నాయి. అందుకే పరిటాల శ్రీరాముల్ని ఆప్రాంత ప్రజలు పోరాటాల శ్రీరాములన్నారు.

కా॥ శ్రీరాములు నిలువెత్తు మనిషి. శారీరకంగా దృఢంగా వుండేవాడు అతని మనస్సులాగే స్వచ్ఛంగా తెల్లగా వుండేవి అతడు ధరించేదుస్తులు.

కా॥ శ్రీరాములు ఆజానుబాహుడే అయినా పసిపిల్లల్నికూడా ఆకర్షించే వాడు. ఆ ఆకర్షణ చెరగని ఆయన చిరునవ్వులో వుండేది.

విప్లవ కారుడిగా శ్రీరాములు భౌతిక స్వరూపం సాక్షం అయితే, ఆయన చిరునవ్వు ఆతని సాహిత్య సాంస్కృతిక హృదయానికి, సున్నితత్వానికి ప్రతి బింబంగా వుండేది.

విద్యాధికుడు కాకపోయినా సునిశితమైన సామాజిక పరిశీలనా శక్తితో, పటుతరమైన వాదనా పటిమతో ఆయన అనంతపురం జిల్లాలోని పెక్కుమంది మేధావుల్ని ఆకర్షించాడు. ఆకర్షించడమేకాదు వారికి నాయకుడయ్యాడు. చైతన్య సాహితి సంస్థను స్థాపించి అధ్యక్షుడయ్యాడు. తరతరాలుగా పేద ప్రజానీకంపై సాగుతున్న దోపిడీని, ఈ దోపిడీకి వ్యతిరేకంగా ప్రజలుసాగిస్తున్న వర్గ పోరా టాలను శాస్త్రీయ దృక్పథంతో విశదీకరించి సాహిత్యపరంగా స్పష్టంచేయ సాగాడు

సిద్ధాంతాలను, సూత్రాలనూ అధ్యయనంచేయడం మాత్రమే చాలదని నసనకోట ప్రాంత పేదరైతుకూలీ ప్రజానీకాన్ని సమీకరించి భూస్వామ్య వ్యతిరేక పోరాటాలకు స్వయంగా నాయకత్వం వహించాడు

కా॥ శ్రీరాములు నాయకత్వాన న్యాయమైన హక్కుల సాధనకోసం, భూముల స్వాధీనంకోసం పేద ప్రజలు సమీకరింపబడేసరికి ఆ ప్రాంత భూస్వాములకు గుండెల్లో రైళ్ళు పరిగెత్తాయి శ్రీరాములుమీద దుష్ప్రచారాలు సాగించారు రివిజనిస్టులు భూస్వాములతో మిలాఖత్ అయ్యారు, కా॥ శ్రీరాముల్ని హతమార్చడానికి కుట్రపన్నారు. భూస్వాములతోత్తు, కాంగ్రెస్ ప్రభుత్వం, కా॥ శ్రీరాములు మీద ఎన్నో తప్పుడు కేసులు బనాయించింది భూస్వాముల, రివిజనిస్టుల, ఫాసిస్టు ప్రభుత్వ దమనకాండల నన్నిటినీ ప్రజాబలంతో కా॥ శ్రీరాములు ప్రతిఘటించాడు. అనుచరుల నైతిక ధైర్యాన్ని అవాంతరాలెన్ని వచ్చినా బెదరిపోకుండా కాపాడగలిగాడు. నిజమైన ప్రజానాయకుడిగా నిలిచాడు కా॥ శ్రీరాములు.

కా॥ శ్రీరాములు ఆంధ్ర-మైసూరు సరిహద్దులోని ఒక గ్రామంలో వివాహానికి హాజరవడానికి బస్సులో వెళుతుండగా, భూస్వామ్య గూండాలు ఇరురాష్ట్ర ప్రభుత్వాల మద్దతుతో ఆ బస్సును అటకాయించి తుపాకులతో కాల్పులు జరిపారు అక్కడ కా॥ శ్రీరాములు సోదరుడు ఆకాల్పుల్లో మొదట బలిఅయ్యాడు.

సుమారు రెండు గంటలసేపు శత్రువులు కాల్పులు జరిపారు. బస్సుకు నిప్పుపెట్టడానికి ప్రయత్నించారు. అయిదుమైళ్ళ దూరంలోనే పోలీసుస్టేషన్ వున్నా, విషయం పోలీసులకు తెలిపినా ఎవరూ జోక్యం కలిగించుకోలేదు.

కా॥ శ్రీరాములు బస్సుదిగి 'కాల్చండిరా' అంటూ గుండె విప్పాడు. రాక్షస భూస్వామ్య గుండాలు దాక్షిణ్య రహితంగా కాల్పులు జరిపారు. నేల కూలిపోయిన కా॥ శ్రీరాములు నెత్తిమీద పెద్ద బండరాయిని వేసి ముఖాన్ని చితగ్గొట్టారు.

కా॥ శ్రీరాములు చెదరని గుండె ఆయన భూస్వామ్య గుండాల పాశవిక దాడిని ఎదుర్కోవడంలోనే స్పష్టమవుతుంది

"విరసమంటే పాణిగ్రాహి వారసత్వమని" నిరూపించిన నిజమైన విప్లవకారుడు కా॥ శ్రీరాములు, ఆయన జీవితం ఆచరణ విప్లవ కారులకు ఆదర్శం. కా॥ పరిటాల శ్రీరాములు కా॥ పోరాటాల శ్రీరాములుగా చరిత్రలో చిరస్థాయిగా వుంటాడు. ఆయనకు విప్లవజోహార్లు. •••

# కల

—మరువాడ రాజేశ్వరరావు

పరిగెడుతున్నాను ... వేగంగా ప రి గె డు తు న్నా ను. ఎవరో తరుముతు న్నారు. భయం కొద్దీ పరిగెడుతున్నాను. మరీ వేగంగా కాదు వేగంగా పరిగెడుతున్నాను...మరీ వేగంగా పరిగెడితే నా మెడలో ఉచ్చు బిగుసుకుం టుంది...

నా మెడలో ఉచ్చువేసి తాళ్ళు తన చేతిలో పట్టుకుని తరుముతున్నాడు వాడు...నేను పరిగెట్టడంలేదు వాడు నా చేత పరిగెట్టిస్తున్నాడు... వాడంటే, 'నాకే తెలియని' భయం...వాడు భయంకరంగాలేడు... వాడంటే భయపడమని ఎవరో చెప్తున్నారు...గాలి గుస గుసలాడుతూ చెప్తోంది...కనిపించని స్వరా లేవో వినిపిస్తున్నాయి. దేవుళ్లూ, దెయ్యాలూ, పూజార్లూ, భూతాలూ... కనిపిం చేవీ, కనిపించనివీ...అన్నీ, అందరూ చెపున్నారు.— వాడంటే భయపడ మని.

నేనే కాదు. నాలాంటివాళ్ళు కోట్లమంది వ్యక్తులు...అందరి మెడల్లోనూ ఉచ్చులు...ఉచ్చుల తాళ్ళు వాడిచేతిలో...మేం పరిగెడుతుంటే దుమ్ము రేగు తోంది. మా కాళ్ళకింద లేచిన దుమ్ము మా కళ్ళలోనే పడుతోంది. ఒకరి నొకరు తొక్కుకుంటూ, తోసుకుంటూ, కొట్టుకుంటూ, కోపగించుకుంటూ— పడుతూ, లేస్తూ పరిగెడుతున్నాం. మరీ వేగంగా 'పారిపోయిన' వాళ్ళు మెడ బిగుసుకుపోయి చచ్చిపోతున్నారు...వాళ్లు 'ఆత్మ హత్య' చేసుకున్నారని గాలి మమ్మల్ని నమ్మిస్తోంది.

రోగాల్లోంచి, రొచ్చుల్లోంచి పరిగెడుతున్నాం, ఆకలిగా, నీరసంగా పరిగెడుతున్నాం. చావుకి భయపడుతూ, చస్తూ పరిగెడుతున్నాం చలిలో ఎండలో, వానలో పరిగెడుతున్నాం. బురదలోనూ, మట్టిలోనూ పరిగెడు తున్నాం. రాళ్ళమీదా, రప్పలమీదా, యినప కొలుముల్లోంచి, చీకటిగనుల్లోంచి, యంత్రాల కోరల మీదనించీ రక్తాలు కక్కుతూ, చెమటలు కారుస్తూ పరిగెడు

తున్నాం. ఆడవాళ్ళ నగ్నశరీరాల మీంచి పరిగెడుతున్నాం. వాడు నవ్వించి నట్టల్లా నవ్వుతూ, ఆడించి నట్టల్లా ఆడుతూ కుళ్ళు సంస్కృతిలోంచి పరిగెడుతున్నాం. మాకు వాడిచ్చిన చచ్చు వెధవ తెలివి తేటల్ని చూసుకుని వెకిలిగా నవ్వుతూ, 'నీకన్నా నేనెక్కువ'ని మాలో మమ్మల్నే తిట్టుకుంటూ అవమానించుకుంటూ పరిగెడుతున్నాం వాడు నూరిపోసిన, 'నీతు'లనే దేవతా వస్త్రాలు తొడుక్కుని అతి మర్యాదస్తులుగా పరిగెడుతున్నాం.

మేం పరిగెట్టిన చోటల్లా బంగారం మొలుస్తోంది. సంపదలు పెరుగుతున్నాయి. సుఖం పూస్తోంది. అవేవి మావి కానట్లు పరిగెడుతున్నాం...అవేవి మావి కాకుండా పరిగెట్టిస్తున్నాడు వాడు...అవన్నీ వాడు నొల్లుకుంటున్నాడు. అవి నొల్లుకుని, బలం పెంచుకుని మమ్మల్ని అదిలిస్తున్నాడు. పాత ఉచ్చుల స్థానంలో కనిపించీ కనిపించని నైలాన్ ఉచ్చులు పన్నుతున్నాడు...

'ఇది అన్యాయం' అంటూ వెనక్కి తిరిగిన వాళ్ళమీద తుపాకులు పేలుతున్నాయి వాళ్ళని కత్తులు నరికేస్తున్నాయి. ఏడుస్తూ, అరుస్తూ పరిగెడుతున్నాం అరిచిన వాళ్ళమీద లాఠీలు విరుగుతున్నాయి. ఒకళ్ళొకరు తోసుకుంటూ, రాసుకుంటూ, ఒగురుస్తూ, పరిగెడుతున్నాం. అక్కడా, అక్కడా ఎదిరించిన వాళ్ళ చావులు చూస్తూ పరిగెడుతున్నాం.

గాలిలో ఏదో మార్పు వినిపిస్తోంది భయం నూరిపోసే గాలిలో అప్పుడప్పుడు ధైర్యం వినిపిస్తోంది. పరిగెట్టే వాళ్ళలో అక్కడక్కడ తెగింపు కనిపిస్తోంది నా పక్కనే పరిగెడుతున్న యువకుడు ఉండుండి, చివ్వున వంగి సర్రున లేచేడు అతని చేతిలో నల్లగా ఏదో మెరుస్తోంది. అది కంకరాయో, గాజు ముక్కో, మరేదో వస్తువు...మెడ మీది ఉచ్చుని ఒకవేటితో తెంపుతున్నాడు. వెనక్కి తిరిగి బలం కొద్దీ విసిరేడు దాన్ని...మమ్మల్ని తరుముతున్న వాడు బాధగా అరిచేడు. వాడి రక్తం రుచి చూసిన గాలి స్వాతంత్ర్య గీతాలు పాడింది...వాని తుపాకీ దెబ్బకి యువకుడు నేల కూలేడు...గాలి కోపంగా వీచింది...గాలి భయంగా వీస్తోంది...గాలి ధైర్యంగా వీస్తోంది... గాలి కోపంగా వీస్తోంది...కొందరు ఉచ్చులు తెగ నరుక్కుంటున్నారు. రాళ్ళూ తప్పేలూ విసురుతున్నారు...మమ్మల్ని తరుముతున్న వాడి రక్తం ఎంతో కొంత చిందిస్తున్నారు. వాడి తుపాకీ దెబ్బలకి కూలిపోతున్నారు ... కొందరు వాడి తుపాకి దెబ్బకి అందకుండా వాడితో పోట్లాడుతున్నారు...ఇవన్నీ గాలి మాకు

చెప్తోంది...గాలి మాకు ధైర్యాన్నిస్తోంది...గాలి విప్లవ గీతాలు పాడుతోంది... గాలి విప్లవ సిద్ధాంతాలు చెప్తోంది...గాలిని బంధిస్తానంటాడు వాడు...పిచ్చెత్తినట్టు గెంతుతున్నాడు వాడు ఉచ్చులు బిగిస్తున్నాడు...గాలిని భయం వీడమని కోరుతున్నాడు...బెదిరిస్తున్నాడు...లంచాలు చూపెడుతున్నాడు...తుపాకుల్తో మందు దట్టిస్తున్నాడు వాడు...కాని, మాకూ తెలుస్తోంది...

వెనకాల వాడు కూలి పోతాడు వాడు పరిగెట్టించినట్టల్లా పరిగెట్టడం మాని, ఉచ్చులు తెంపుమని, అందరం కలిసికట్టుగా, అందరం ఒకటిగా... తలో రాయీ రప్పా విసిరితే వాడు అమాంతం కూలిపోతాడు మాకు స్వేచ్ఛ లభిస్తుంది...ప్రాణాలకి తెగించి పోరాడుతున్న వాళ్ళని చూస్తున్న కొద్దీ మాకూ నమ్మకం కలుగుతోంది!!

వ్యక్తులకే కాదు, సమాజానిక్కూడా కలలొస్తాయి. కలలు కల్పనలు కావు. వాస్తవమే, నిద్రలో-'కల'గా రూపుతీసుకుంటుంది?...కల ఆగిపోయినా వాస్తవం ఆగదు... ●●●

---

స్కెచ్ :

# మూడు కోణాలు

—జీ. డి.

కోర్టు వాతావరణం.

ఆమె పోలీస్‌వ్యాన్ ఎక్కబోతున్నది. మూడేండ్ల పాప వచ్చి ఆమెకాళ్ళను చుట్టేసుకున్నది. ఆమె ఆపాప నెత్తుకొని ముద్దుపెట్టుకున్నది ఆ పాపకూడ ఆమెను ముద్దు పెట్టుకుంటూ అంటున్నది. "అమ్మా! తొందరగ రావె".

"అట్లనే" అన్నట్టుగ ఆమె తల వూపింది. ఆమె నోటినుంచి మాటలు వస్తే కళ్ళనుంచి నీళ్లకూడా బయటపడేందుకు సిద్ధంగా వున్నాయ్. అందుకే ఆమె మాట్లాడలేదు.

ఆమె భర్త, పాపను తన చేతుల్లోకి తీసుకుంటూ బుజ్జగిస్తున్నడు. "జైల్లోని అక్కయ్యలకు పాఠాలు చెప్పడం పూర్తికాంగనె-అమ్మ వస్తుంది."

ఆమె వ్యాన్‌లోకి పోయింది. ఆమె వెనుక తుపాకిలు మోస్తున్న ఇద్దరు రక్షకభటులు వ్యాన్ ఎక్కిన్రు.

వ్యాన్ కదిలిపోయింది. వ్యాన్ కనిపిస్తున్నంత సేపూ పాపచేయివూపుతూ వున్నది.

అమ్మ కళ్ళల్లో నీళ్ల ఆ పాపకు కనబడవు.

అమ్మ ఏదో ముఖ్యమైన పనిమీద పోతున్నదని పాప అనుకుంటున్నది. తను కొన్ని రోజులు అమ్మ నుంచి దూరంగా వుంటే బాధేమిటి ? అనుకుంటున్నది.

ఆ పాపకు తెలవదు. వాళ్ళ అమ్మ పీడిత ప్రజల ఆవేదనలను పీడక హృదయాలమీద గుద్ది చెప్పిందని; ప్రజాభిప్రాయాన్ని ప్రకటించిందని.

ఆమెను ఆ దేశం శిక్షించింది. ఆ దేశపు రాజ్యాంగం సెక్షన్ 420 (ఎ) పకింద ఆమె రాజద్రోహం నేరం చేసింది.

ఆ అమ్మ (గోర్కీ) పావెల్ అమ్మకు వారసురాలు తన పాపలో ఆమె పావెల్‌ను చూసుకుంటున్నది.

**2**

అది రైల్వే స్టేషన్:

ఆయన రైలు ఎక్కబోతున్నడు పత్రికా విలేఖరులు వచ్చి ఆయనను చుట్టేసిన్రు.

"పావెల్ అమ్మనూ, ఆమె వారసులనూ ఎప్పుడు వదిలిపెడతరు?" అని (అధికారంలో వున్న) ఆయనను అడిగిన్రు.

"వెంటనే వదిలిపెట్టాలె" అన్నడు ఆయన.

"మీ కేసుకూ, వాళ్ళ కేసులకూ సంబంధం లేదా?".

"అది నాకు తెలవదు వాళ్ళనైతే వదలాలె".

అధికారంలో వున్నవాడే 'ఎవరో వదలిపెట్టాలె' అంటె ఏమిటో విలేకరులకు అర్థంకాలేదు.

ఆయన రైలెక్కిండు. ఆయన వెనుకే తుపాకీలు మోస్తున్న రక్షకభటులు రైలెక్కిన్రు

రైలు కదిలిపోయింది.

ఆయన ఎన్నో ముఖ్యమైన పనుల్లో పోతున్నడని విలేకరులు అనుకుంటున్నరు. పావెల్ అమ్మా తదితరులు కొన్ని రోజులు జైల్లో వుంటే బాధేమిటి? అనుకుంటున్నరు.

వాళ్ళకు తెలుసు: పస్తులు పన్న పనివాళ్ళ తరవున సాయుధపోరాటం నడిపి సెక్షన్ 420 (ఎ) క్రింద ముద్దాయిగ వున్నవాడు ఆయన-యిదివరలో.

ముద్దాయి కాకముందు ఆయన-ఆ దేశపు ఎన్నికలగురించి మాట్లాడుతూ-పోలింగ్‌బూత్ దగ్గర ఓటు వేయడానికి క్యూలో నిలబడ్డ పిల్లలను చూచినట్లు చెప్పిండు రైఫిల్మెట్లతో తప్ప ఈ వ్యవస్థను కూల్చలేమని ప్రయత్నాలు చేసిండు.

కాలం కలిసి వచ్చింది. అవే ఎన్నికలు ఆయనను అధికారంలోకి తెచ్చినయ్. సెక్షన్ 420 (బి) ప్రకారం ఆయనమీది రాజద్రోహ నేరపుకేసు ఎత్తేసిన్రు. అహింసలో నమ్మకమున్నట్టు ఆయనచేత హామీ ఏమీ రాయించుకోలేదు. రాజ్యాన్ని ఆయనకు అప్పగించిన్రు.

ఆయన జార్జ్ సుబ్రహ్మణ్యం. క్రైస్తవులూ, బ్రాహ్మణులూ రకరకాల వాళ్ళు కలిసి రాజ్యం చేస్తున్న రాజకీయ పార్టీవాడు.

3

అది భవంతులున్న బజారు.

కొత్త భవనం ఒకటి లేస్తున్నది అక్కడ.

ఆమె కారు ఎక్కబోతున్నది. ఆమె కొడుకు అర్జెంటుగ ఏదో చెప్ప వచ్చిండు: "అమ్మా! పావెల్ అమ్మా, జార్జ్ సుబ్రిహ్మణ్యం మనమీద పగ తీసుకోదా? జాగ్రత్త!"

ఆమె నవ్వింది.

ఆ నవ్వును వర్ణిస్తూ కొన్నాళ్ళ కింద కవులు కవిత్వంరాసి కనకాభిషేకం చేయించుకున్నరు.

"పిచ్చివాడా! మనకేమీ కాదు, భయపడకు."

కారు కదిలిపోయింది.

నిర్మాణంలోవున్న తమ భవనం దిక్కు నడిచిండు కొడుకు.

ఆమె మొన్నటిదాకా అధికారంలో వుండె చివరి రోజుల్లో కొడుకును దేశంమీద వదిలింది. ఇద్దరూ కలిసి చేయని ఘోరంలేదు. చివరకు దేశ చరిత్రను వక్రంగా రాయించి కాల నాళికలో భద్రపరచింది కూడఆమె.

సెక్షన్ 420 (ఎ) క్రింద ఆమె రాజద్రోహనేరం చేసినట్టు రుజువైతే, కొడుకుతో కలిసి రాజ్యాంగంలో సెక్షన్ 420 (సి)ని చేర్చి, తనకోసం సెక్షన్ 420 (ఎ)లో సవరణ చేయించింది.

ఆమెకు ఆ దేశప్రజల అజ్ఞానం బాగా తెలుసు.

కొత్తగా అధికారంలోకి వచ్చినవాళ్లు తననుకాని, తన కొడుకును కాని ఏమీ శిక్షించరని ఆమెకుతెలుసు. వాళ్ళు, వీళ్ళు అందరూ ఒకప్పుడు తోడు దొంగలేనని ఆమె మరచిపోలేదు.

శిక్షేమైనా పడినా-వారు చనిపోయేదాకా తీర్పుచెప్పక, చెప్పలేక, ఆ దేశపు రాజ్యాంగం వాళ్ళను రక్షిస్తుంది.

పావెల్ అమ్మ, ఆమె వారసుల విషయం తనకంటె బాగా కొత్తవాళ్ళే చూసుకుంటరన్న నమ్మకం ఆమెకు.

ఆమె గోవులా కనిపించే గోమాయువు. వాళ్ళ జాతిపితకున్న పేరే ఆమెదికూడా. పేదప్రజల రక్తంతో ఎదుపెక్కిన ఎర్ర గులాబీకి వారసురాలు ఆమె; ఎందరినో హతమార్చి, ఎన్నికొంపలో కూల్చిన ఎర్ర త్రికోణ ధారిని కన్న 'వీరనారి'.

---

**కటకటాల్లో కలాలు :**

## కంసుని కంప్యూటర్

—శివసాగర్

కంసునికి
కంప్యూటర్ వుంది
(అలా నవ్వుతారేం ?)
మేనక
హెలికాప్టర్లో కిందికి దిగింది,
కురుక్షేత్రంలో
(ప్లీజ్ ! నవ్వకండి)
అణు బాంబులు వాడకపోవటం
(అది శ్రీకృష్ణుని ఆదేశం)
కొంతలో కొంత నయం
లేకపోతే
గుడ్డుగుడిచి పోయేది కదా
భరతుని దేశం !
ఏ మాట కామాట
మనకెప్పట్నుంచో
తంతివుంది, వితంతి వుంది
వితంతువుంది
గండభేరుండం మనజెట్ విమానం
పుష్పక విమానం సార్థకనామం.
మర్చిపోయాను
మన్నించగలరు
కంసునికి కంప్యూటరున్నట్లే
మన వేదాల్లో మార్క్సిజం వున్నదిష.
నమ్మండి ! నమ్మకపోండి
(మీ కర్మ)
స్వదేశీ పానీయంలో నిషా ఎక్కు-
వయిందని
అనుకుంటే అనుకోండి
నేతులు తాగిన
మన తాతల మూతుల్లో
కావలసినంత
కాక్ టెయిల్ ఫ్లేవర్ !

# నీతో చెప్పనేలేదు

—బి. తారకం

నీతో చెప్పనేలేదు
నేను వెళ్తున్నప్పుడు
నన్ను పోలీసులు పట్టుకున్నప్పుడు
నీతో చెప్పలేదు.
నన్ను చూస్తూ నిలబడి పోయావు
నీ కళ్ళ నిండా నీళ్ళు
నీ కన్నీళ్ళు తుడవడానికి
నా చేతులకు సంకెళ్ళు...
నిశ్శబ్దానికి గంటలు కొడుతూ
పోలీసు బూట్ల చప్పుళ్ళు
సముద్రం హోరులా మనసులో
పొంగే మాటల కెరటాలు
నిశ్శబ్దాన్ని చీల్చలేని
హృదయనాదాలు,
నీతో చెప్పనేలేదు...
అప్పుడు
ఏ మాటలైనా ఎన్నైనా
ఉట్టి శబ్దాలేనని
అర్థం ఏమీ వుండదని
చెప్పలేకపోయాను నీకు.
ఉండ నీడలేని
ఎండు బ్రతుకులను
తిన తిండిలేని
మండు బ్రతుకులను
మండకడుతున్న జీవాలను
మందగిస్తున్న శవాలను
చూశాను నేను.
వారి గాథలను బాధలను
నా మాటల్లో పేర్చాను
నా ఊపిరితో ఊదాను
చీకటిని తొలగించాలని
వెలుగు తేవాలని
ఉవ్విళ్ళూరాను.
నాకు తెలియనేలేదు
ఒక రోజు...
నువ్వూ నేనూ సాయంకాలం
అందాలను మలచుకొంటున్నప్పుడు
ఆనందాలను తొలుచుకొంటున్నప్పుడు
హఠాత్తుగా
వాళ్ళొచ్చారు
నీకు చెప్పనేలేదు...
నీ కన్నీళ్ళు
నాకొక్కడికే కాదని
కోటికోటి బాధాతప్త హృదయాలకు
నివాళులని
ఆనంద జలదాలని
ఆశాకిరణాలని
అరుణార్ణవ కెరటాలని
నీకు చెప్పనేలేదు...

15-1-1976.
సెంట్రల్ జైల్, హైదరాబాద్.

# పునర్జన్మ

—చెరబండరాజు

నా నీడలో నా భావాలవేడిని అనుమానించి
తుదకంటా నాశనం చెయ్యాలని
నన్ను వెన్నంటే నడుస్తుంటారు పోలీసులు

నేను అనాలోచితంగా అమాయకంగా
ఆకాశం కేసి చూస్తే
నా చూపుల ఎత్తు పల్లాల్ని కొలుస్తారు

నా పాద ముద్రలో
విప్లవగీత చరణాల ఎత్తుగడల్ని పట్టుకోవడానికి
మట్టిని భద్రపరిచి పరిశోధనల కంపుతారు

నాకూ నీకూ అన్నంపెట్టి ఆశ్రయమిచ్చే హృదయాల్ని
విశ్వజనీన మానవతా దీపాల్ని
ఆర్పాలని చూస్తారు

నా కళ్లు అసహ్యించుకుంటున్న
కుళ్లును తొలగించకుండా
నా కళ్లనే పెరికేస్తారు

నేను పసిపాపల్ని ముద్దాడితే
వారి చెక్కిళ్ల మీది తడిని
కత్తులతో చెరపుతారు

నాకు నోరుండడం నేరం
నేను ఆలోచించడం అరాచకం
ఉన్నా అవి నావైనవిగా ఉండగూడదు

ఇదంతా వాళ్ల పాటకు నేను
పల్లవిని గాక పోవడమే
వాళ్ళ పల్లకికి బోయీగా మారకపోవడమే

నన్ను దేశద్రోహి అన్నా
కుట్రదారుడన్నా
వాళ్ల కున్న కొలమానం ఒకటే
వారి నిత్యపారాయణ పూజ్య గ్రంథం వారి రాజ్యాంగం

మతాలు ఎన్నైనా
వాటి సారభూత మౌఢ్యం ఒక్కటే అయినట్టుగా

దోపిడీ రాజ్యాంగా లెన్నైనా
వాటి వర్గ రక్షణ "పవిత్రకార్యం" ఒకటే
నాది శ్రమైక జీవన సౌందర్య గీతం
మతానికి దోపిడీ పథానికి నేను పల్లవిని కాను

బొట్టు బొట్టుగా నా నెత్తుటిని
ఈ నేల విముక్తికోసం విత్తనంగా చల్లుతాను
బందీనైనా బానిసనుకాను
నన్ను కదిపినా ఖండించినా
మళ్లీ మళ్లీ అలలా పుట్టుకొస్తూనే వుంటాను

సెంట్రల్ జెయిలు
హైదరాబాదు.

---

అమర వీరుల మరణానికి చలించిపోకండి
నెత్తురు మాత్రమే చరిత్రను కొత్త రంగుల్లో రాస్తుంది
—గోర్కీ

---

# కంఠమ్మ ఎత్తవే....

—ఎస్. కె.

నిలవాల నిలవాల చెల్లెమ్మా[1]
నిలిచి అడుగేయాల చెల్లెమ్మా

అయినోడు ఖయిదాయె అక్కడా నువు ఖయిదు
అయిన ఏమాయెనే చెల్లెమ్మా
ఆగనిదె మనపోరు చెల్లెమ్మా
ఆకొనే బతుకులకు ఆయన్న సేతులకు
బందిఖానా లేని బతుకు సంకెల లేని
పోరు దారొకటేనె చెల్లెమ్మా
పోరాడు పోరాడు చెల్లెమ్మా... ॥నిలవాల॥

ఒక్క దానివి నువ్వు ఒక్క నాటికికావు
ఒక సారి అనుకోవె చెల్లెమ్మా
ఒక మాట యినుకోవె చెల్లెమ్మా
ఆ పక్క చూసుకో యీ పక్క చూసుకో

---

1 ఇందిరా వెంగళరావు పాలనలో హింసకు నిర్బంధాలకు గురియై తప్పుడు కేసుల్లో ఇరికించబడిన కళాకారుల్లో అందరికన్నా ముందు గుర్తొచ్చేది సంధ్య. సంధ్య జననాట్య మండలి గాయకురాలు జనగామ తాలూకా వెలిదండ గ్రామంలో ఒక భూస్వామిని చంపిన కేసులో పోలీసులు సంధ్యను, ఇంజనీరయిన ఆమె భర్తను ఇరికించి జైలులో పెట్టారు. తీరా కోర్టు ఆ యిద్దరినీ నిర్దోషులుగా తీర్పుచెప్పి వదిలేసింది. అట్లాగే నానా బాధలకు, చిత్రహింసలకు గురిచేసి గుంటూరు పోలీసులు జననాట్య మండలి కళాకారులపై మోపిన రాజద్రోహనేరం (124ఎ) కేసునుకూడ కోర్టు కొట్టివేసింది. అంటే వట్టి పుణ్యానికే, విప్లవ గాయకురాలైన నేరానికే సంధ్య మొదలైన కళాకారులు హింస, నిర్బంధం అనుభవించాల్సి వచ్చింది. పోలీసుల లాఠీ దెబ్బలవల్ల సంధ్యకు గర్భస్రావంకూడ జరిగి ఆరోగ్యం తీవ్రంగా దెబ్బతిన్నది.

మనవాళ్ళు అయినోళ్ళు మనతోనె వున్నోళ్ళు
నీ పక్కె చూసుకో చెల్లెమ్మా
నీ తోడు కొమురక్క[2] చెల్లెమ్మా... ॥నిలవాల॥

గాలి పిలిచేచోటు వెలుగు చూచేచోటు
కటకటా లెక్కడివె చెల్లెమ్మా
కానిమ్మ కానిమ్మ చెల్లెమ్మా
జైలు గోడల మధ్య తెగంట మోగాలి
కోటి గొంతుల మంట 'కో' యంటు పలకాలి
కంఠమ్మ ఎత్తవే చెల్లెమ్మా
కత్తి నీ కుత్తుకే చెల్లెమ్మా... ॥నిలవాల॥

ఎందర్ని కాల్చినా ఎందర్ని కూల్చినా
నిప్పారిపోలేదు చెల్లెమ్మా
నివురైన గప్పలే చెల్లెమ్మా
నువ్వు నిలిచినచోట నిప్పు గుప్పంటాది

---

2. కొమురమ్మ కోటగిరి వెంకటయ్య భార్య. 75 జూన్ 22 ప్రాంతాలలో కోటగిరి వెంకటయ్యను, పెండ్లి శంకరయ్యను పోలీసులు పెద ముప్పారం (మానుకోట తాలూకా)లో పట్టుకొని కాల్చివేసిన తర్వాత కొద్ది కాలానికి ఎమర్జెన్సీలో ఆమె అరెస్టయింది. ఆమె రెండవ బిడ్డ విప్లవ కుమార్ వరంగల్ జైలులోనే పురుడు పోసుకున్నాడు. కందికొండ భూస్వామిని చంపిన కేసులో వరంగల్ సెషన్స్ కోర్టు బర్లయాదగిరి రాజుకు ఉరిశిక్ష, ఈమెకు యావజ్జీవ శిక్ష విధించింది. కాని హైకోర్టు వీరినీ, ఈ కేసులోని ఇతరులనూ నిర్దోషులని తీర్పు యిచ్చింది. కొమురమ్మ సికిందరాబాదు కుట్రకేసులో ముద్దాయి. రెండు సంవత్సరాల తర్వాత బెయిలుపై విడుదలయిన ఆమెకే కాదు, నాలుగేళ్ళ కూతురు నిర్మలకూ, కొడుకు విప్లవ కుమార్‌కూ జైలే ఇల్లయింది ఈ రెండేండ్లు.

అడుగేసినాచోట అగ్గి భగ్గంటాది
నీలో౯కె చూసుకో చెల్లెమ్మా
నిలువెల్ల మంటలే చెల్లెమ్మా
నిలిచేవు నిలిచేవు చెల్లెమ్మా
నిలిచి అడుగేసేవు చెల్లెమ్మా

—సెంట్రల్ జెయిలు, వరంగల్.
అగస్టు 1975

---

# ప్రజా సేవకనుగుణంగా మన భావాలు మలచుకుందాం

— మావోటుంగ్.

అనువాదం: ఐ. సుధాకర్

సాహిత్యము - కళల గురించి ఏనాన్‌నుండి చైర్మన్ మావో ప్రసంగం (మే, 1942) వెలువడి పదేళ్ళయింది. చైనా విప్లవంతో మార్క్సిజం-లెనినిజం పరిపూర్ణంగా సమన్వయం పొందాయనడానికి యీ ప్రసంగం ఒక మంచి ఉదాహరణ. 1919 మే ఫోర్తు ఉద్యమం నుండి నాటివరకు (1942) విప్లవ సాహిత్య కళా ఉద్యమాలలో జరిగిన లోపాలను, ప్రత్యేకించి మౌలిక సూత్రాలకు సంబంధించిన వాటిని, యీ ప్రసంగంలో చక్కగా విమర్శించారు. సాహిత్యము, కళల విషయంలో నేటికీ ప్రచారంలోవున్న అనేక శ్రామికవర్గేతర భావాలను, గందరగోళాలను యిది స్పష్టంచేసింది. చాలాకాలమై వివాదగ్రస్తంగా వున్న అనేక మౌలిక సమస్యలను యిది లోతుగా పరిశీలించి పరిష్కరించింది. సాహిత్యము కళలు, ప్రజలకు-ముఖ్యంగా రైతులు, కార్మికులు, సైనికులకు-ఉపకరించాలని యిది స్పష్టంచేసింది. ఈ లక్ష్యాన్ని చేరుకోవడానికై సాహితీపరులూ కళాకారులూ తమ సిద్ధాంత పునాదిని, భావజాలాన్ని పునర్నిర్మించుకోవాలి. అందుకై నిండు మనసుతో విప్లవ పోరాటాల్లోకి దూకాలి.

ఈ ప్రసంగం చైనా సాహిత్యకళారంగాల చరిత్రలో ఒక గొప్ప విప్లవానికి ప్రతీకగా నిలిచింది. ఈ చారిత్రక ప్రసంగానికి పూర్వంకూడా చైనా సాహిత్య కళారంగాలు ఏమీ బీడువారిపోలేదు. కాని ఆ నాటి సృజనరీతులు కేవలం విమర్శనాత్మక సత్యపరంగానే ఉండేవి. ఈ ప్రసంగం తరువాత విప్లవవాస్తవికతా దృష్టి మొదలయింది. 'ది వైట్ హెయిర్డ్‌గర్ల్', 'ది రైమ్స్ ఆఫ్ లి-యు-నాయ్', 'సన్ ఓవర్ ది సంకాంగ్ రివర్', 'ది హరికేన్' వంటి రచనలు ఈ విప్లవవాస్తవికతా యుగానికి ప్రతీకలు. అంతేకాదు భావిసాహిత్యకళాసృష్టికి కావల్సిన మార్గదర్శక సూత్రాలనుకూడా యీ ప్రసంగం సూచించింది. ఈ ప్రసంగంలో చర్చించిన అనేక విషయాలు-ప్రచారవిస్తృతికీ ప్రమాణాలస్థాయికీ మధ్య వైరుధ్యానికి గతితార్కిక పరిష్కారం; సాహిత్య విమర్శ విధానాలు ప్రమాణాల గురించిన నిర్దిష్ట సూత్రాలు; బూర్జువా పెటీబూర్జువా విలువల గురించి నిశిత విమర్శ, సాహితీ కళాకారుల సిద్ధాంత పునర్నిర్మాణ అవసరం; ఐక్య సంఘటన నిర్మాణంలో సూచనలు-ఒక్క చైనాకేకాక అందరికీ ప్రమాణాలే. ఈ ప్రసంగంలోని మావో బోధనలను పూర్తిగా అర్థంచేసుకొని, నిరంతరం అనుసరిస్తే ఎవరైనా సరే తప్పులు చేయరనీ, మంచి ఫలితాలు సాధించగలరనీ వాస్తవాలే రుజువు చేసాయి. దీనిని నిర్లక్ష్యంచేస్తే పొరపాట్లు జరగక తప్పదు. కనుక, దేశవ్యాప్తంగా మావో ప్రసంగం పదవ వార్షికోత్సవం జరుపుకుంటున్న యీ తరుణంలో (1958) దీనిని మరింత లోతుగా అధ్యయనంచేసి సాహిత్యకళారంగాలలో మన దృక్పథాన్ని, కృషిని నిశితంగా పరిశీలించుకుందాం.

సాహిత్యకళారంగాలలో మనకృషిలో యింకా కొంత గందరగోళం వుందని ఒప్పుకోవాలి. మొదట సిద్ధాంత పునర్నిర్మాణ ఉద్యమంలోను, తరువాత లంచగొండితనమూ, దుబారా, బ్యూరాక్రసీలకు వ్యతిరేకంగా సాగిన ఉద్యమంలోనూ మన కృషిలో తప్పులు గత సంవత్సరం బయటపడ్డాయి. వీటికి గల కారణాలలో ముఖ్యమైనది మనం చైర్మన్ మావో బోధించిన విధానాన్ని సరిగా అర్థంచేసుకోకపోవడమే. దానిని సరిగా వంటబట్టించుకోకుండానే అది మనకు అర్థం అయిందని అనుకుంటున్నాం. అందుకే దానిని అమలు చేయడంలో మనం తరచుగా తప్పటడుగులు వేసి పొరపాట్లు చేస్తున్నాం. కార్మికులు, రైతులు, సైనికుల కొరకే మనం కృషిచేయాలి, అనే ప్రాథమిక సూత్రాన్ని పాటించకపోవడమే మన తప్పులకు మూలకారణం.

ఏనాన్ ప్రసంగంలో ఛైర్మన్ మావో, 'మనం ఎవరికోసం రాయాలి ?' అనే ప్రశ్నను లేవనెత్తారు. "జపాను వ్యతిరేకోద్యమం-లో సాహిత్య కళా రంగాలలో పనిచేస్తున్న కామ్రేడ్స్ ఈ సమస్య పరిష్కారమయి పోయినట్లే భావిస్తున్నారు కాని వాస్తవంగా మనలో చాలామంది కామ్రేడ్స్‌కు సరియైన జవాబే తెలియదు" అన్నారాయన. ఈనాటికీ మనలో అనేకులకు దీనికి స్పష్టమైన జవాబు తెలియదనే చెప్పాలి.

మనం అవలంబించే పద్ధతులు ఎలా వుండాలన్నది తరువాతి ప్రశ్న. వీలయినంత ఎక్కువమంది ప్రజానీకానికి తెలిసేలా చెప్పడం మన మొదటి కర్తవ్యమని అందరమూ ఒప్పుకుంటాం. "బహుళ ప్రచారం పొందడమే ఉన్నత ప్రమాణాలకు గీటురాయి అనీ, అయితే ప్రచారం తిరిగి ప్రమాణాల స్థాయిని బట్టే వుంటుందనీ" మనం చెబుతాం. కాని, నిజానికి ప్రచార బాహుళ్యాన్ని మనం చిన్నచూపు చూడడమూ, చవకబారుతనంగా వ్యాఖ్యానించడమూ జరుగుతూంది. ఎక్కువ ప్రచారం పొందడమూ, ఉన్నత ప్రమాణాలు సాధించడమూ రెండూ భిన్నవిషయాలని మనం అనుకుంటాం. 'ప్రచారానికి రాసేదివేరు, ఉన్నత ప్రమాణాల కొరకు రాసేదివేరు' అనే దృష్టి మనకుంది. కొందరు మరో మెట్టు ముందుకుపోయి ప్రమాణాలు అనగానే బూర్జువా కొలబద్దలువెతుకుతారు ఇటువంటి పొరపాట్లు ఎన్నో నిరంతరం జరుగుతూనే ఉన్నాయి.

"ఎవరికోసం, ఎవరి ప్రయోజనంకోసం" అనేదే మౌలిక సమస్య అని ఏనాన్ ప్రసంగంలో ఛైర్మన్ మావో పదే పదే హెచ్చరించారు. ఈ విషయంలో ఖచ్చితమైన పంథా అవలంబించి, సవ్యమైన కృషి కొనసాగించాలంటే పెటీ బూర్జువా సాహితీపరులూ కళాకారులూ తమ సిద్ధాంత జ్ఞానాన్ని పటిష్టంగా పునర్నిర్మించుకోవాలి. మనం ఆ ప్రసంగం చదివి యీ మాటలు గుర్తుంచుకున్నాం. కాని అది చాలదు. ఆ ఆదేశాలను ఎంతవరకు పాటించగలిగాం ? వాటి కనుగుణంగా ఎంతవరకూ కృషి చేశాం అన్నది అసలు ప్రశ్న.

కార్మికులు, రైతులు, సైనికులకు నిజంగా ఉపయోగపడేలా కృషిచేయాలంటే సాహితీ కళాకారులు ముందు వాస్తవ విప్లవ పోరాటాలో పాల్గొనాలనీ, తద్వారా వారిభావాలు, అనుభూతులూ తదనుగుణంగా రూపొందుతాయనీ ఛైర్మన్ మావో మనకు చెప్పారు. అంతేగాక, మార్క్సిజం-లెనినిజం తోపాటు సమాజాన్ని కూడా బాగా అధ్యయనం చేయాలి. 'మార్క్సిజం-లెనినిజం అంటే,

 

ప్రజాజీవితానికి పోరాటాలకు అనువర్తింపజేసే సజీవ శాస్త్రీయ విజ్ఞానం తప్ప కేవలం గ్రంథాల్లో దొరికేది మాత్రంకాదు' అనికూడా ఆయన హెచ్చరించారు. కనుక, వాస్తవ విప్లవ పోరాటాలకు నిండు మనసుతో అంకితమవుతున్నామా అనేదే కీలకమైన ప్రశ్న. నేడు దీనిని ఎవరూ వ్యతిరేకించరు. కాని, నిజంగా పోరాటంలో పాల్గొంటున్నవారు కూడా వానిలో మనస్పూర్తిగా లగ్నమయారని ఖచ్చితంగా చెప్పలేము. ఒకానొక సమయంలో ఒకానొకవిషయంలో పూర్ణమనస్కులుగా వున్నవారు తదితర సందర్భాల్లో అరకొరగా వుండవచ్చు.

పూర్ణమనస్కత అంటే ఏమిటి? పరిపూర్ణమైన స్వార్థరాహిత్యం. ప్రజలను-ముఖ్యంగా కార్మికులు, రైతులు, సైనికులను-సేవించడం అనే సూత్రానికి దృఢంగా కట్టుబడి వుండటం; వారి ప్రయోజనాలకు వ్యతిరేకమైన వాటినన్నిటినీ రాజీ లేకుండా ఎదుర్కొనడం యిదీ పూర్ణమనస్కత. ఇందుకో ఏ మాత్రం కొరవడినా నిండు మనసుతో విప్లవానికి అంకితం కానట్టే. అలాంటి వారు భౌతికంగా పోరాటంలో పాల్గొంటున్నా నిజానికి విప్లవాన్ని బయట వుండి చూస్తున్నట్టే లెక్క. సిద్ధాంతరీత్యా పునర్నిర్మాణం పొందడానికి యిది చాలా అర్థంకిగా వుంటుంది. పెటీ బూర్జువా వర్గం నుండి వచ్చిన మేధావులందరూ ఆలోచనలవల్ల శ్రామిక వర్గంలో చేరివుండవచ్చు. గత సమాజంలో వారు నిత్యం నిరుద్యోగ భయంతో వెంపరలాడినవారే; అస్థిరమైన బతుకుతో వారిలో అనేకులు పస్తులు కూడా పడివుంటారు. అందువల్ల పాత సమాజమంటే అసహ్యంతో వారు విప్లవాన్ని కోరుకుంటున్నారు పాత సమాజంలోని యితర బుద్ధి జీవులందరివలెనే సాహిత్య కళాకారులు కూడా నిరుద్యోగానికీ, భద్రతలేమికీ, పస్తులకూ గురి అయినవారే బహుశా ఆ బాధలన్నీ వీరికే ఎక్కువ కూడానేమో. ఈ పరిస్థితులన్నిటినీ పరిశీలిస్తే వారి స్వభావం బోధపడుతుంది. వారిలో కొందరు విప్లవ కార్యక్రమంలో చేరారు కూడా అందువల్ల యీ బుద్ధి జీవులందరూ సిద్ధాంత పునర్నిర్మాణంపట్ల తరచు నిర్లక్ష్యంగానూ, విముఖంగానూవుంటారు "నేనెప్పుడూ బుద్ధి జీవినే, నేనెన్నడూ ఎవర్నీ దోచుకోలేదు. నేను విప్లవానికెప్పుడూ సుముఖంగానే వుంటున్నాను. నేను శ్రామిక వర్గంలో ఒకడిని కానా? మళ్ళీ నేనుసిద్ధాంతపరంగా పునర్నిర్మాణం కావలసిందేముంది?" అనుకుంటారు వాళ్ళు. అంటే తమలో శ్రామికవర్గానికి చెందని అన్యవర్గ భావజాలం వున్నదనీ, సిద్ధాంతరీత్యా

దానిని తిరిగి ప్రజాపరంగా పునర్నిర్మించాల్సిన అవసరం వుందనీ వారు అంగీక రించరు. ఈ ఆలోచన సరైనది కాదు

"బుద్ధిజీవికీ, శ్రమజీవికీ ఆర్థికపరమైన వైరుధ్యం లేనప్పటికి, వారి జీవిత విధానం, పనిపరిస్థితులు ఒకటి కావు. అందువల్ల వారి భావాలు, అనుభూతులలో కొంత వైరుధ్యం కలుగుతుంది" (లెనిన్). పెటీ బూర్జువాల పరిస్థితి కూడాయిదే. ఒకవైపు విప్లవాన్ని సునాయాసంగా స్వీకరిస్తూనే వారు సిద్ధాంతపరంగా, భావ జాలంలో శ్రామికులతో భేదిస్తారు, విరోధిస్తారు. ఈ వాస్తవాన్ని తిరస్కరిస్తే, పోరాటాలకు అంకితమైనప్పటికీ, సిద్ధాంత పునర్నిర్మాణ విషయంలో ఎవరూ, సాధించగలిగేదేమీలేదు. సాహిత్య కళాకారులు యీ విషయాన్ని నిర్లక్ష్యంచేస్తే వారు కార్మికులు, రైతులు, సైనికులకు ఉపయోగపడరంకల్ల.

నిండు మనసుతో విప్లవంలో నిమగ్నం కాకపోవడం, వాస్తవ పోరాటా లకు అంకితం కాకపోవడం, తమలో అన్యవర్గ భావాలు మిగిలి వున్నాయని అంగీకరించకపోవడం-యివి పెటీ బూర్జువా సాహిత్య కళాకారులు సాధారణంగా చేసేతప్పులు-సిద్ధాంత పునర్నిర్మాణానికి వీరు పెద్ద అడ్డంకి. విప్లవ పథం స్వీకరించి, చాలా కాలం కార్మికులు, రైతులు, సైనికుల మధ్య జీవిస్తూ కూడా సిద్ధాంత పునాదిని పునర్నిర్మించుకోడానికి నిరాకరిస్తే, పరిస్థితుల్లో మార్పులు ఎదురైనప్పుడు వారు ఆ తాకిడిని తట్టుకోలేకపోతారు మనోనిబ్బరం కోల్పోయి తీవ్రమైన తప్పులు చేస్తారు. సిద్ధాంత పునర్నిర్మాణం క్రమ పరిణామంలో దీర్ఘకాలం కొనసాగవలసినదని అతి క్లిష్టమైనదనీ దీని నుండి మనకు స్పష్ట మవుతుంది

కొద్ది మాసాల కాలం పల్లెపట్టునో, కర్మాగారంలోనే గడిపినంత మాత్రాన పరిపూర్ణంగా సిద్ధాంత పునర్నిర్మాణం జరిగిపోయిందనుకుంటే అది తేలిక భావమూ ప్రమాదకరమయినా ఆలోచనా కూడా. దాని గట్టిదనం వాస్తవ సమస్యల పరిష్కారంలో పరీక్షించుకోవలసిందే. సాహిత్య కళాకారులకు సృజనాత్మకమైన వారి కళా సృష్టియే నిజమైన పరీక్ష. తమ భావజాలంలోని పునర్నిర్మాణ పటిమను పరీక్షించుకోవాలంటే రచయితలు నిర్విరామంగా రచనలు చేస్తూ, విమర్శ-ఆత్మవిమర్శ చేసుకుంటూ ముందుకు సాగిపోవడం ఒక్కటే మార్గం. రాయడం, విమర్శించుకోవడం జీవితంలోకి పోయి ప్రజల నుండి నేర్చు కోవడం, మళ్లీ విమర్శించుకోవడం, మళ్లీ ప్రజలలోకి పోవడం, యిలా యీ

క్రమాన్ని తిరిగి తిరిగి శ్రద్ధగా కొనసాగించడం ద్వారా మాత్రమే సిద్ధాంత పునర్నిర్మాణం విజయవంతంగా పూర్తి చేయగలం

సాధారణంగా ఒక సమస్య ఎదురవుతూంది. "ఇతరుల రచనలు చదివితే వానిలో లోపాలు అన్యవర్గభావాలు తేలికగా ఎత్తిచూపగలను, కాని స్వయంగా రాయబోతే నా పాత్రలు బోలుగా బొక్కగా వాస్తవ దూరాలుగా వుంటాయి. శ్రామికవర్గ వేషభాషలలో బూర్జువా వర్గ భావాలనే పొదగడంవంటి తప్పులు చేయకపోవచ్చుగాని, పోరాట పీకులు, ఆదర్శ కార్మికులతో పోల్చితే నా పాత్రలు తెలవెలబోతూ వుంటాయి. నా రచనల్లో బలమైన సిద్ధాంత పునాదిలేనిలోపం కన్పిస్తుంది. ఎందువల్ల? నా సిద్ధాంతజ్ఞానం సక్రమంగా సంపూర్ణంగా పునర్నిర్మింపబడనందువల్లనే నేను సిద్ధాంతరీత్యా ఉన్నతస్థాయి రచనలు చేయలేకపోతున్నానా?" అని కొందరు రచయితలు మథనపడుతున్నారు. "సూటి చూపులు, మొద్దుచేతులూ" అనే సామెత వతుగా వుంటుంది వీరిస్థితి. రచయితకు సూటి చూపు లేకపోతే ప్రమాదమే. సూటి చూపులు లేకుండానే తుణ్ణమైనచేతలువుండే రచయితలుంటూ వుండరు. అందే యితరుల రచనల్లో లోపాలను తెలుసుకోలేకపోయినా తాము మాత్రం నిర్దుష్టంగా రాయగలగడం ఎవరికీ సాధ్యంకాదు. నిర్దుష్టంగా రాయడానికి సూటిచూపులు తప్పనిసరిగా వుండవలసిందే. కాని, చూపు అన్నంత సూటిగానూ చేతలుకూడా తుణ్ణంగా వుండేలా తీర్చిదిద్దడం ఎలా అన్నదే సమస్య

చూపులు సిద్ధాంతజ్ఞానమనీ, చేతలు శిల్పమనీ యీ రెండూ పరస్పర విరుద్ధమైనవనీ కొందరనుకుంటారు. వీరు "మాకు మంచి ఉన్నతస్థాయి సిద్ధాంత పరిజ్ఞానంవుంది, యిక శిల్పంలో శిక్షణ పొందడమే తరువాయి" అంటారు. దీనితో నేనేకీభవించను. అంతేకాక యిది ప్రమాదకరమైన ఆలోచనకూడా. ఒక రచన సిద్ధాంతపరంగా లోపాలుకలిగి వుందంటే, ఆ రచయిత పరిశీలన నిశితంగానూ, విశ్లేషణ సమగ్రంగానూ లేదన్నమాట. ఇది రచయిత ఆలోచనా సామర్థ్యానికి సంబంధించినదే గాని శిల్పానికి సంబంధించినది మాత్రంకాదు. ఇక్కడ శిల్పం అప్రధానమైనది. మొత్తంగా శిల్పానికే ప్రాముఖ్యత నివ్వడం, శిల్పంపైనే దృష్టినంతా కేంద్రీకరించడం, శిల్పానికీ సిద్ధాంత పరిజ్ఞానికీ వైరుధ్యం వున్నదనడం మొదలైన తప్పుడు అవగాహనలన్నీ యిటువంటి భావాలవల్లనే కలుగుతాయి. అందుకనే యీ భావాలు ప్రమాదకరమైనవి. మార్క్సిజం-లెనినిజం అధ్యయనం

చేయడం, సమాజాన్ని పరిశీలించడమే దీనికి సరైన పరిష్కారమని ఛైర్మన్ మావో తన ప్రసంగంలో సూచించారు

"రచయితలు కళాకారులు శిల్పనైపుణ్యాన్ని అభ్యసించవలసిందే. కాని, ప్రతి విప్లవకారుడూ తప్పనిసరిగా మార్క్సిజం-లెనినిజం చదవాలి. రచయితలు కళాకారులు కూడా దీనికి మినహాయింపు కాదు. సమాజాన్ని కూడా బాగా అధ్యయనం చేయాలి. బాగా అధ్యయనం చేయాలి. అంటే సంఘంలో వివిధ వర్గాలూ, వాటి పరస్పర సంబంధాలు, వాటి స్థితి గతులు, స్వరూపస్వభావాలు క్షుణ్ణంగా తెలుసుకోవాలి". అంతేకాదు : "మనం మార్క్సిజం-లెనినిజం చదవడం మన రచనల్లో ఆ శాస్త్ర చర్చలను, సిద్ధాంత ఉపన్యాసాలనూ గుప్పించడానికి కాదు సమాజాన్నీ, సాహిత్యం, కళలనూ గతి తార్కిక భౌతిక వాద దృష్టితోనూ, గతి తార్కిక చారిత్రక దృష్టితోను పరిశీలించి అర్థంచేసుకోడానికే మనం వాటిని చదవాలి. మార్క్సిజం-లెనినిజం వాస్తవాలను సరిగా ఆకళింపు చేస్తుంది తప్ప తానే వాటిని తారుమారుచేయదు." ఛైర్మన్ మావో యిచ్చిన యీ ఆదేశాలననుసరించి పెటీ బూర్జువా మేధావులు ముందుగా చేయవలసిన పని తమ సిద్ధాంత పరిజ్ఞానాన్ని సక్రమంగా పునర్నిర్మించుకోవడం. అంటే, కార్మికులు, రైతులు, సైనికులకు సేవచేసే దృష్టిని అలవరచుకోవాలి. ఈ దృక్పథాన్ని మనం స్థిరంగా ఏర్పరచుకోకపోయినా, ఆచరణలో దృఢంగా అవలంబించకపోయినా మనం మనం కష్టజీవుల పక్షమే వహిస్తామని నోటితో చెప్పుకున్నప్పటికీ, ఎప్పటికీ అలాచేయలేం.

అయితే యిటువంటి దృక్పథం ఏర్పడినంత మాత్రంతో మార్క్సిజం-లెనినిజం సంపూర్ణంగా అవగాహన అయింది అనుకోరాదు విప్లవకారులందరూ తప్పనిసరిగా తెలుసుకోదగిన మార్క్సిజం-లెనినిజంను శాస్త్రీయంగా అధ్యయనం చెయ్యాలి సజీవ పాత్రలను చిత్రించాల్సిన రచయితలు, కళాకారులు సమాజంలోని వర్గాలను వాని పరస్పర సంబంధాలను సమగ్రంగా క్షుణ్ణంగా అర్థంచేసుకోవాలి అందుకొరకు గతి తార్కికభౌతికవాదం, గతి తార్కిక చారిత్రకవాదం అధ్యయనం చేయాలి

పైన ప్రస్తావించిన "సూటిచూపులు మొద్దుచేతులు" అనేది యీ విషయాన్నే సూచిస్తుంది. ఒక రచయితకు సిద్ధాంతజ్ఞానం ఎంతవున్నా అతడు

సమాజ పరిశీలనలో గతి తార్కిక సూత్రాల్ని సరిగా అన్వయించలేదన్నమాట. అదీ అసలు కీలకమైన విషయం అంతేగాని సిద్ధాంత జ్ఞాన లోపం కాదు ఒకని సిద్ధాంత పునర్నిర్మాణం సరిగా సంపూర్ణంగా లేదంటే అతడి ఆలోచనల్లో యింకా కార్మిక వర్గేతర భావజాల బీజాలు ఉన్నాయనే అర్థం. అవి రచనలో ప్రతి ఫలించి, అది మౌలికంగా సక్రమంగా వుండాలేదా అనే ప్రశ్న పుడుతుంది. అంతేగాని, అతని సిద్ధాంత జ్ఞానం స్థాయి తక్కువా ఎక్కువా అని కానే కాదు.

ఒక రచన సిద్ధాంత స్థాయి ఉన్నతంగా లేదంటే, అందులో సూత్ర విషయాలలో తప్పులు లేనప్పటికీ, విషయ పరిశీలన విశ్లేషణ తగినంత సమగ్రంగానూ పటిష్టంగానూ లేవని అర్థం. సమస్యల చర్చ సమాజగత వైరుధ్యాల లోతులకు పోదు; అటువంటి రచన అసలైన వైరుధ్యాలకు, చిల్లర వైరుధ్యాలకు మధ్య విచక్షణ చేయదు; ఆయా వైరుధ్యాల సార్వజనీన స్వభావాన్ని గాని, ప్రత్యేక విశిష్టతను గాని బయటకు తీసి చూపలేదు. వైరుధ్యాలలోని విభిన్నాంశాల ఐక్యతను, సంఘర్షణను అట్టి రచన స్పష్టం చేయజాలదు, శ్రామిక వర్గం నుంచి వచ్చే రచయితే అయినా, మార్క్సిజం - లెనినిజం అధ్యయనం చేయక, గతి తార్కిక సూత్రాలను సమాజ పరిశీలనకు సక్రమంగా అన్వయించక పోయి నట్టయితే అతడి రచనలు కూడా సిద్ధాంత రీత్యా ఉన్నత ప్రమాణాలను సాధించ లేవు. పెటీ బూర్జువా మేధావులు, సాహిత్య కళాకారుల విషయంలో సిద్ధాంత పునర్నిర్మాణం సరైన దృక్పథాన్ని ఏర్పరచి గట్టి చేసేది కాబట్టి యిది అత్యంత ప్రధానమైన ప్రముఖ విషయమని గమనించాలి; లేకుంటే వారు ఏ రచనలూ బాగా చేయలేరు.

ఆ నాటి సాహిత్య కళావేత్తల సిద్ధాంత స్థాయి, నాటి రచనల లోపా లోపాలను గమనించి ఛైర్మన్ మావో తన ఏనాన్ ప్రసంగంలో 'ఎవరికి సేవ చేయాలి', 'ఎలా చేయాలి' అనే ప్రశ్నలకు స్పష్టంగా జవాబులిచ్చారు. అంతే గాక, "ఆచరణ" "వైరుధ్యాలు" అనే మరో రెండు రచనల్లో వాస్తవ సృజన శీల పద్ధతుల గురించి యింకా సమగ్రంగా చర్చించారు. ఈ రెండు వ్యాసాల్లో వివరించిన సూత్రాలు కూడా మనం అవశ్యం తెలుసు కోదగినవి. అవి కేవలం తాత్విక చింతనకు సంబంధించినవి గనుక వానితో మనకు ప్రమేయం లేదను కోవడం పొరబాటు.

మనకి జీవితంలో కొంత అనుభవం వుంది. కాని, 'మనకు తెలిసిన విషయమంతటినీ ఎలా క్రమబద్ధం చేయాలి', 'ఆ విషయ సంగ్రహం నుంచి సర్వజనీన సాధారణ విషయాలను ఎలా సూత్రీకరించాలి', 'వాటికి ఎలా మెరుగు పెట్టాలి', 'రచనలో వాటిని ఎలా చెప్పాలి' అనే చిక్కులతో నిత్యం తికమక పడుతూ వుంటాం. ఈ గందరగోళమంతా తప్పని సరిగా రచనల్లో ప్రతిఫలిస్తుంది. కొన్ని అంశాలు, విషయాలు గుర్తుకు గుర్తులుగా జాబితాలుగా రాస్తాం; ఫొటో తీసినట్టు అద్దంలో చూపినట్టు తెలిసినదంతా మక్కికి మక్కి ఎక్కించేస్తాం; జీవితం లోతులకు పోకుండా పైపై విషయాలెన్నిటినో ఏకరువు పెడతాం; విహంగ దృష్టితో జీవిత సర్వస్వాన్ని పరికించి పరిశీలించటానికి మారుగా చిన్న చిన్న మూలలంట దూరి చూడయత్నిస్తాం. ఇవన్నీ మన రచనల్లో రోజూ ఎదురయే పొరపాట్లే. 'ఆచరణ' శ్రద్ధగా అధ్యయనం చేస్తే ఈ అనేకరకాల పొరపాట్లను సరిదిద్దుకోగలుగుతాం.

మనం బతుకులో అనేక విషయాల గురించి ప్రాథమిక జ్ఞానం సంపాదిస్తాం. ఇది కేవలం పైపై సమాచారానికి సంబంధించి సహజంగానే ఏకపక్షంగానూ పాక్షికంగానూ కూడా వుంటుంది. విషయం యొక్క పైపై లక్షణాలను తడువుతుందే తప్ప ఈ జ్ఞానం అసలు తత్వాన్ని వెలికి తీయదు. వివిధ విషయాలను విడివిడిగా చూడటమే తప్ప యిది వాని పరస్పర సంబంధంతో వాని అభివృద్ధిక్రమాన్ని పరిణామాన్ని విశదం చేసే సూత్రబద్ధ జ్ఞానాన్ని తెలియజేయదు. ఇటువంటి ప్రాథమిక జ్ఞానం సరైనదిగానే కనుపించినా, ఒక్కొక్కసారి తప్పుడు అభిప్రాయాలకు దారి తీయవచ్చు కనక, కేవలం చూపు రుచి, వాసన, తాకిడి, వినికిడి వలన సంపాదించే ఈ ప్రాథమిక జ్ఞానంతోనే మనం సంతృప్తి చెందరాదు. మరి కొంత ముందుకు పోయి హేతుబద్ధ విజ్ఞానాన్ని సంపాదించాలి. అంటే విషయాన్ని సంపూర్ణంగా అవగాహన చేసుకోవాలి. అసలు తత్వాన్ని, పరస్పర అంతస్సంబంధాలను అర్థం చేసుకోవాలి. అంటే విషయాలను విపులంగా, సంపూర్ణంగా లోతుగా ఆకళింపు జేసుకోవాలి.

మన జ్ఞానాన్ని ప్రాథమిక దశనుండి, హేతుబద్ధ విజ్ఞానం దశకు మలచుకోగలిగితే, నిరంతర సమాజ పరిణామ క్రమంలోని వివిధ విషయాల పరస్పర సంబంధాలను మరింత స్పష్టంగా చూడగలుగుతాం. ఆ అభివృద్ధి క్రమం వెనుకనున్న నియమాలు సూత్రబద్ధంగా అవగాహన అవుతాయి. కనుక, ప్రాథమిక

జ్ఞానానికీ హేతుబద్ధ విజ్ఞానానికీ పరిమాణంలోనేగాక గుణాత్మకంగా కూడా చాలా తేడా వుంది. అయితే హేతుబద్ధ విజ్ఞానం సముపార్జించడానికి అపారమైన ప్రాథమిక జ్ఞానం అవసరమౌతుంది. ఎందుకంటే తగినంత సమాచార సంగ్రహం లేకుండా విషయం యొక్క నిజ లక్షణాలను వానికి సంబంధించిన నియమాలను, విజ్ఞానాన్ని సంపాదించలేం.

ఉదాహరణకు సాహిత్యంలో నమూనాలు వంటి పాత్రల సృష్టి తీసుకుందాం సమాజంలో ఒక స్థాయికి చెందిన ఒక నమూనా పాత్ర (Typical character) సృష్టించాలంటే వాస్తవంగా ఆ స్థాయిలో, బ్రతికే అనేక మంది అనేక రకాల వ్యక్తులను సన్నిహితంగా పరిశీలించడం తప్పనిసరి. అలాగైతేనే ఆ స్థాయిని గురించి కొన్ని సామాన్య విషయాలు తెలుస్తూ నమూనాలాగ నిలిచి పోగల ఒక నిజమైన పాత్రను సృష్టించగలుగుతాం. అవసరమైన ప్రాథమిక విషయ సేకరణ మొదటి మెట్టు తరువాత ఆ సమాచారంలోని సామాన్య సూత్రాలను తరచుతూ దానిని హేతుబద్ధ విజ్ఞానం స్థాయికి చేర్చాలి. దానిని తిరిగి ఆచరణలో పరీక్షించుకుంటూ అభివృద్ధి చేయాలి. ఆ క్రమంలో మాత్రమే మనం సరైన జ్ఞానాన్ని పెంపొందించుకోగలుగుతాం.

ఆగకుండా రచనలుచేస్తూ వుండడం, జీవితానుభవాన్ని గడిస్తూవుండడం ఒక దాని వెంట ఒకటి నిరంతర ధారలా సాగాలి. నిరంతరం రచనలు చేస్తూ వుంటేనే మన జ్ఞానం సమగ్రంగా నిర్దుష్టంగా వున్నదీ లేనిదీ, కేవల ప్రాథమిక దశ నుండి హేతుబద్ధ దశకు పరిణతి చెందినదీ లేనిదీ ఎప్పటికప్పుడు పరీక్షించుకోడానికి వీలవుతుంది సృజనాత్మకమైన రచనలు చేసాక తిరిగి జీవితంలో తుల్లోకి పోయి ప్రత్యక్షానుభవం గడించడం వల్లనే మనం చిత్రించిన విషయాలు సామాజిక వాస్తవాలకు సరిపోతున్నాయాలేదా, అవి సామాజిక పరిణామసూత్రాలకు అనుగుణంగా వున్నాయాలేదా అని సరిచూడగలం. అయితే, ఒకసారి రాయడంతో అంతకు పూర్వం సంపాదించిన అనుభవ జ్ఞానమంతా ఖర్చయి పోయిందనీ, తిరిగి బతుకులోకి వెళ్ళి పరిశీలించడం కొత్త సామగ్రి సంపాదించుకోడానికేననీ భావిస్తే అది చాలా పొరపాటు.

ప్రాథమిక జ్ఞాన సముపార్జన సమాజాన్ని అర్థం చేసుకునే క్రమంలో మొదటి మెట్టు. దీనిని దాటకుండా ముందుకుపోలేం విషయసేకరణను నిర్లక్ష్యం చేస్తే మన రచనలు డొల్లగా, నిర్జీవంగా, బోరుగా కేవలం సిద్ధాంత చర్చలుగా

తయారవుతాయి. అలాగని కేవలం ప్రాథమిక విషయ సేకరణతోనే తృప్తి పడితే అప్పుడు మన రచనలు సహజత్వ సిద్ధాంతం వూబిలో దిగబడతాయి. కేవల సిద్ధాంత దృష్టివల్ల రచనలు ప్రత్యేక భావాలు కలవే వస్తాయి. ప్రాథమిక జ్ఞాన సముపార్జన, తద్వారా ఒనగూడిన హేతుబద్ధ జ్ఞానాన్ని ఆచరణతో అనుభవంతో పరీక్షించుకోవడం అనవసరం అనుకుంటే యిటువంటి అనర్థాలు కలుగుతాయి. అయితే కేవలం సమాచార సేకరణపైనే కేంద్రీకరించడంవల్ల, అపారమైన విషయపరిజ్ఞానమూ అనుభవమూ వున్నప్పటికీ దాన్ని హేతుబద్ధంగా తర్కించి విజ్ఞానంగా సముద్ధరించాల్సిన అవసరం గుర్తించక పోవడంవల్ల పీరికి సహజత్వం అనే జబ్బు అంకురిస్తుంది.

కేవల సిద్ధాంత దృష్టి, కేవల సహజత్వ దృష్టి మాత్రమేగాక సాహిత్యంలోను, కళలోను పొడసూపే మరొకతప్పు ధోరణి వుంది. అదే పడికట్టు పద్ధతి. పాత కొత్తల మధ్య సంఘర్షణ గురించిగాని. వెనకబడ్డతనం సంస్కరణను గురించి గాని రాసేటప్పుడు ఆయా వైరుధ్యాల ప్రత్యేక లక్షణాలను సార్వజనీన లక్షణాలతో అనుసంధానించి ప్రత్యేక విషయాలను వర్ణించడంద్వారా సార్వజనీన విషయాలను వెలువరించే నేర్పు మనం సమగ్రంగా సాధించలేదు. పాఠకుడు వైయక్తిక ప్రత్యేక విషయాలకే పరిమితమై పోకుండా వుండాలంటే, వైయక్తిక విషయాలనే వర్ణిస్తున్నా మన రచన దానిని దాటి విశాలంగా చూడగలగాలి. అలాగే ప్రధాన అప్రధాన వైరుధ్యాల మధ్య విశ్లేషణ చేయడంలో కూడా మనం సిద్ధహస్తులం కాలేదు అనుకనే మన పాత్రలూ యితివృత్తాలూపడికట్టు పద్ధతి బురదలో (Formula) పడిపోతూ వుంటాయి.

కేవల సిద్ధాంత ప్రధానంగానూ, కేవల సహజత్వ ప్రధానంగానూ రాసే రచనలకూ, పోత (లేక పడిగట్టు) పద్ధతిలో రాసే రచనలకూ చాలా పోలిక వుంటుంది. వస్తురీత్యా వాటి మధ్య తేడా వుంటుంది.

పోతలేక పడికట్టు పద్ధతి తరువాతిమెట్టు ప్రణాళికా పద్ధతి (Scheme). సిద్ధాంత ప్రధాన రచనలకి పీటికి పెద్దతేడా వుండదు. ప్రణాళికా బద్ధంగా రాసే రచయితలకు జీవితానుభవం శూన్యం. వీరు యితర రచయితల చిత్రణను దొంగిలించి వాని ఆధారంగా (కాపీగా) పాత్రలు, యితివృత్తాలు కృత్రిమంగా సృష్టించి అతుకుల బొంతలు తయారుచేస్తారు.

రచయితకు జీవితానుభవం ఎంతోవున్నా ఆ విషయ పరిజ్ఞానాన్ని హేతుబద్ధ విజ్ఞానంగా సంతరించుకొనే సమర్థత లోపించడంవల్ల యీ పడికట్టు పద్ధతి రచనలు వస్తాయి. "ఆచరణ" అనే మావో వ్యాసం మన ఆలోచనాక్రమాన్నెలా సక్రమంగా పెంపొందించుకోవాలో, విషయ పరిజ్ఞానాన్ని ఎలా సృజనాత్మక పద్ధతిలో పునర్నిర్మించుకోవాలో బోధిస్తుంది. ముడిసరుకు (సమాచారం) నుండి విషయాన్ని సేకరించడం, అవాస్తవాలనుండి వాస్తవాలను వేరుచేయడం, తెలిసిన సమాచారంనుండి తెలుసుకోదగ్గ విషయాన్ని రాబట్టడం, ఉపరితలం దాటి లోతుగా పరిశీలించడం"- వీనిద్వారా నైపనిని ఎలా సాధించవచ్చునో అది సూచిస్తుంది.

ప్రాథమిక విషయ పరిజ్ఞానాన్నీ, సమాచార సంపదనూ పరిశీలించి నిజ లక్షణాలను, వివిధాంశాల వైరుధ్యాలను కనిపెట్టడమే అన్నిటికంటె ప్రధానం. సమాజాన్ని అధ్యయనంచేసే మౌలిక విధానాన్ని సరిగా గ్రహించడానికి "వైరుధ్యాలగురించి" అనే రచన చాలా తోడ్పడుతుంది. మనం ముందుగా ఒక విషయం గుర్తించాలి.

"ఒక విషయంయొక్క అభివృద్ధికి కారణాలు దాని వెలుపల వుండవు; దానిలోపలనే యిమిడివున్న వైరుధ్యాలలోనే వుంటాయి. వీని మూలంగానే ప్రగతి, అభివృద్ధి కలుగుతాయి. అంతర్గత వైరుధ్యాలే అభివృద్ధికి ప్రాథమిక కారణం. దానికి యితర విషయాలతోగల పరస్పర సంబంధమూ, అందువల్ల కలిగే ప్రతిక్రియలూ ఆ అభివృద్ధికి అప్రధాన కారణాలు.

నిరంతరం మార్పు చెందుతూ అభ్యుదయకరంగా అభివృద్ధిచెందే సమాజమూ జీవితమే సాహితీ కళాకారుల లక్ష్యం కనుక వారు ఈ విషయాన్ని బాగా అవగాహన చేసుకోవాలి. "సమాజంలో అంతర్గతంగావుండే వైరుధ్యాలే సమాజ ప్రగతికి మూలకారణం. అవియేమంటే: ఉత్పత్తి శక్తులకు, ఉత్పత్తి సంబంధాలకు మధ్యగల వైరుధ్యాలు, విభిన్న వర్గాల మధ్యగల వైరుధ్యాలు, పాత, కొత్తల మధ్యగల వైరుధ్యాలు. వీని పెరుగుదలే సమాజాన్ని ముందుకు నడిపించి, నవ సమాజస్థాపనను, నిరుపయోగమైన పాత్రను తుడిచిపెట్టే క్రమాన్ని త్వరితంచేస్తుంది," అందువల్లనే వైరుధ్యాల చిత్రీకరణ వాటి పరిష్కారం సాహిత్యానికి, కళకీ తప్పనిసరి అవుతుంది. వైరుధ్యాలను బయటపెట్టని ఏ

రచన అయినా కృతకంగావుంటుంది ; ఎందుకంటే నిజ జీవితం నిండా అన్నీ వైరుధ్యాలే.

అయితే వైరుధ్యాలకు సార్వజనీనత, ప్రత్యేకత రెండూ ఉంటాయి. ఆయా సందర్భాల ప్రత్యేక లక్షణాలను ఆకళింపు చేసుకొనకుండా ఒక రచయిత కేవలం వైరుధ్యాల సార్వనీనతను మాత్రమే చూడవచ్చు అంటే, ప్రత్యేకంగా వివరాలలోకి లోతుగా పోకుండా మొత్తంగా విషయాన్ని సాధారణ పరిశీలన చేయవచ్చు. ఉదాహరణకు, ఒక కర్మాగారానికి వెళ్ళినప్పుడు రచయిత యాజమాన్యంలోని ముఖ్య లీడర్లనో కార్మిక సంఘ కార్యవర్గంలోని ముఖ్యులనో మాత్రమే కలిసి, జట్లు జట్లుగా వుండే మామూలు పనివాళ్ళనూ, అసలుపనిచేసే చోట వున్న కార్మికులను కలుసుకోకపోవచ్చు. అలా చేయడం వల్ల, అసలైన, నిర్ణయాత్మకమైన విషయాలను కనిపెట్టలేకపోవచ్చు. అప్పుడు అతని రచనలు వైరుధ్యాల సార్వజనీనతను మాత్రమే సూచిస్తాయి. 'ప్రతి సంఘటనలోనూ ఆయా వైరుధ్యాల స్వీయ ప్రత్యేక స్వభావం ఒకటుంటుంది'. దానిని విడిచి పెట్టి వైరుధ్యాల సార్వజనీనత మాత్రమే ప్రదర్శించే ఏ రచన అయినా ఏకపక్షంగా వుండక తప్పదు. వైరుధ్యంలోని వివిధాంశాల స్వభావాన్ని అవగాహన చేసుకోకపోవడం', ఉదాహరణకు, రైతుల్నే అర్థంచేసుకుని భూస్వాములను అర్థంచేసుకొనకపోవడం- సమస్యను పాక్షికంగా చూడడమే అనాలి.

"ఇటు వైరుధ్యపు మొత్తం స్వభావాన్నీ గమనించక, అటు విభిన్నాంశాల స్వభావాలను విడివిడిగానూ గమనించక, లోతుకుపోయి సూక్ష్మ వివరాలను తెలుసుకోవడమూ తద్వారా వైరుధ్యాల స్వభావాన్ని అవగాహన చేసుకోవాల్సిన అవసరాన్ని తృణీకరించడమూ, దూరాన్నుండి వైరుధ్యపు సూచనల్ని మాత్రం చూసి అంతటితోనే పరిష్కారానికి పూనుకోవడం" యిది సమస్యలను పైపైన తడివే పద్ధతి. రచనలలో సిద్ధాంత పరమైనలోపాలు, పడికట్టు పద్ధతి రచనల లోపాలు అన్నీ ఆయా రచయితల ఏకపక్ష దృక్పథం వలన, పైపై పరిశీలనతో సరిపుచ్చుకొనే పద్ధతివలన కలిగేవే. వైరుధ్యాల సార్వజనీకతకు ప్రత్యేకతకు మధ్యగల సంబంధాన్ని ఛైర్మన్ మావో యిలా స్పష్టంచేశారు.

వైరుధ్యాల సామాన్యతకు-ప్రత్యేకతకు మధ్య గల సంబంధమే దాని సార్వజనీతకు ప్రత్యేకతకూ మధ్యగల సంబంధం పరిణామక్రమంలో మొదలు నుంచి చివరి వరకు అనునిత్యంగావుండే వైరుధ్యమే సార్వజనీనత దీని స్వభావం

ప్రత్యేక వైరుధ్యం స్వభావంలో పొదగబడి వుంటుంది. దేనికది ప్రత్యేకమైన వైరుధ్యంకు ప్రత్యేక స్వభావం వుంటుంది. కాని యివన్నీ తాత్కాలికమైనవి ఆయా ప్రత్యేక పరిస్థితులపై ఆధారపడినవి కనుక ఒక దానికొకటి సంబంధించి వుంటాయి".

సాహిత్యకళాకారులకు యీ వాక్యాల ప్రాధాన్యం ఎంతయినా వుంది. ఏ రచన అయినా వైరుధ్యాలయొక్క యీ సార్వజనీన ప్రత్యేక స్వభావాలు రెంటినీ వ్యక్తీకరించగలుగుతే అది సిద్ధాంతపరంగా ఎంతో పరిపుష్టంగా వుంటుంది.

అంతేకాదు ఒకే సమయంలో అనేక వైరుధ్యాలుంటే, వానిలో ఏదో ఒకటే ప్రధానమైనది గాను మిగతావి అప్రధాన వైరుధ్యాలుగానూ వుంటాయి. ప్రధాన వైరుధ్యం అంటే ఏమిటి : "ఒక పరిణామ క్రమంలో అనేక వైరుధ్యాలుంటే వాటిలో ఏదో ఒకటే నిర్ణయాత్మకపాత్ర వహిస్తూ ప్రధానంగా వుంటుంది మిగతావి అప్రధాన స్థితిలో వుంటాయి. ఒక పరిణామ క్రమాన్ని అధ్యయనంచేసేటప్పుడు... ఆవిధంగా ప్రధానవైరుధ్యం కనుగొనడానికే మనశక్తినంతా ఉపయోగించాలి". అయితే, "ఒక వైరుధ్యంయొక్క ప్రధాన, అప్రధాన అంశాలు తారుమారయి అందుకనుగుణంగా ఆ విషయం గుణాత్మకమైన మార్పు పొందవచ్చు." విభిన్న వైరుధ్యాలను సరిగా పోల్చుకుని విశ్లేషించి వానిలో ప్రధాన అప్రధాన అంశాలను సరిగా వివేచన చేయకపోవడం మూలంగానే గొప్ప కళాఖండాలు కావలసినవి పడికట్టు పద్ధతికి బలైపోతున్నాయి. దీనివల్లనే వైరుధ్యంలోని ప్రధాన అప్రధాన అంశాల అంతర్ పరివర్తననుకూడా చిత్రించలేకపోతాం

పైన చెప్పిన విధంగా 'ఎవరికోసం రాయాలి' అనే సమస్యను ముందుగా పరిష్కరించుకొని, తరువాత 'ఎలా రాయాలి :' అనే సమస్య ఆలోచించాలని ఛైర్మన్ మావో ప్రసంగంవల్ల మనకు స్పష్టమౌతూంది. ఈ సమస్యలను సవ్యంగా పరిష్కరించాలంటే మనకు సిద్ధాంత పునర్నిర్మాణం తప్పనిసరి మనకు ఒకటే పంథా వున్నది అది కార్మికులు, రైతులు, సైనికులకు ఉపయోగించేలా రాయడమే.

వాస్తవికత, సృజనా పద్ధతులకు సంబంధించిన ముఖ్య సమస్యలలో "సమాజ అధ్యయనం" అతి ముఖ్యమైంది. "ఆచరణ", "వైరుధ్యాలు" అనే రెండు రచనల్లో దీని గురించి నిర్దుష్టమైన సమగ్రమైన ఆదేశాలున్నాయి.

మార్క్సిస్టు-లెనినిస్టు-సాహితీ సిద్ధాంతాలలో యీ మూడు రచనలూ ప్రమాణ గ్రంధాలు.

మన పంథాను వెలుగు వెల్లువతో నింపడానికి యింత నిర్దుష్టమైన సూత్రాలు, బలమైన సిద్ధాంత జ్ఞానం మన ముందుండగా మనం ఉన్నతమైన రచనలు ఎందుకు చేయలేం?

ఈ సందర్భంగా మనం రెండు విషయాలు దృఢంగా నిశ్చయించుకుందాం. ఒకటి-బతుకులోకి, ప్రజాపోరాటాల్లోకి లోతుగా చొచ్చుకుపోయి నిజాయితీతో మన సిద్ధాంత ప్రాతిపదికను, భావజాలాన్ని పునర్నిర్మించుకుందాం. రెండు-సమాజాన్ని సమగ్రంగానూ అత్యంత శ్రద్ధాసక్తులతోను క్షుణ్ణంగా అధ్యయనం చేసి కార్మికులు, రైతులు, సైనికులను సేవించే పంథాలో పయనిద్దాం. ...

(1958 స్ప్రింగ్, చైనీస్ లిటరేచర్‌లో మావోటున్ వ్యాసానికి స్వేచ్ఛానువాదం)

---

## ఏజెంట్లకు మనవి

గతంలో సృజన ఏజెంట్లుగా వున్నవారు పాత బకాయీలు మొత్తం చెల్లిస్తూ—ఏ సంచికనుండి ఏజెన్సీ మళ్ళీ తీసుకోదలిచారో (ఎన్ని కాపీలు కావాలనుకుంటే అన్ని కాపీలకి) 25% కమీషను మినహాయించుకుని డబ్బు ముందుగా చెల్లించేట్టయితే ఇకముందు ఏజెంట్లుగా కొనసాగుతారు.

---

# "కొన్ని కలలు నిజమౌతాయి" - విప్లవ ఆశావాదంతో కన్నకలలు నిజమవుతాయి

## కె. శివారెడ్డి కావ్యం "ఆసుపత్రి గీతం"

కవి శివారెడ్డి ఒక దుర్మార్గపు వ్యవస్థకు బలయి పోయిన ఆప్తమిత్రుని గురించి ఆలోచించినపుడు ఆసుపత్రి కేవలం ఆయనకు ప్రతీకగానే అర్థమయింది. హాత్యగావించబడ్డ చరిత్రల్ని చదవటానికి/దోచబడుతున్న వర్తమానాన్ని దర్శించటానికి - కారు మబ్బుల ఆకాశాన్ని చదవటానికి ఆయన కళ్ళు పుస్తకాలయినయి. ఈ కంటి దీపం ముందు కూర్చుని తన్నుతాను సమీక్షించుకొని ప్రపంచాన్ని విశ్లేషణతో వీక్షించినపుడు 'హాస్పిటలంతా దుఃఖిస్తున్న మహానేత్రంలా/ హాస్పిటలంతా గుండె నిండుగా మంటవున్న వెలిగించని బుడ్డిలా వర్షంలో నానుతూ వుంది, కనుక శివారెడ్డిలో పైకి కనిపించేది ఆర్తియే అయినా, ఆయన కళ్ళు వర్షంలో నానుతూవున్నా, ఆ గుండె నిండా మంట వున్నది. ఇవ్వాళ దుఃఖిస్తున్న అదే మహానేత్రం ఇవ్వాళ కలలు కంటున్న అవి ఉద్విగ్నతతో నిండినవి మాత్రమే కాదు ఉద్యమం ఊపిరితో వార్షుకాభ్రం లాంటి ఆయన కవితాకాశంలో ఇంద్రధనసుల్ని సృష్టించినవి. అందుకే ఆసుపత్రి గీతమంతా అలలుగా కలలుగా అనిపించినా ఆయన 'ఈ బాణం మొత్తం వ్యవస్థకే తగలాలని గురిపెట్టబడింది, అని సూటిగానే చెప్పుకున్నాడు, ఇదే అల 'రాజముద్ర'కు పీడకల అయింది. కవికి బాణమయింది, 'రాజముద్ర' కలా నిజమవుతుంది. కవి కలా నిజమవుతుంది ఎందుకంటే 'కొన్ని కలలు నిజమవుతాయి', అయితే 'రాజముద్ర' కది కల అయితే బాగుండుననిపించినా భవిష్యత్ చరిత్ర నిర్ణయం. కవికది విప్లవ ఆశావాదంలో అలలయి వచ్చిన కల.

ఈ వ్యవస్థ లాగానే ఆసుపత్రి రోగాల నిలయం. అయితే అందరివీ ఆకలి రోగాలు, కన్నీటి రోగాలు, అత్యాచారానికి బలి అయిపోయిన రోగాలు, అదియాసల రోగాలు కావు. కొందరివి సుఖరోగాలు. వాళ్ళూ ఆసుపత్రిలోనే వున్నారు.

కాని వాళ్ళ ఆసుపత్రి ఫైవ్‌స్టార్ హోటల్లాగుంటుంది. శివారెడ్డి ఆసుపత్రిని ధ్వంసం చేయాలని అనుకున్నపుడు రోగాలను రూపు మాపాలనుకుంటున్నాడు. ఆసుపత్రుల అవసరం లేని, దుఃఖరోగాలే కాదు సుఖరోగాలు కూడ రాని ఆరోగ్యకరమయిన వ్యవస్థను కోరుకుంటున్నాడు. 'అలలు'గా విభజించిన ఈ కావ్యంలో చివరి రెండు అలల్లోనూ, ఒక దాంట్లో ఇపుడున్న వ్యవస్థను, అంతరాలను స్పష్టంగానే చెప్పాడు. కలగా అన్యాపదేశంగా చెప్పిన ఆఖరి అల 'కల'లో తన ఆశావాదాన్ని కప్పలేదు. ఆసుపత్రి వ్యవస్థ గురించి ఆలోచించిన, ఆవేదన చెందిన కవికి కెరటాలు కెరటాలుగా భావాలు వచ్చినవి. అందుకే కావ్యాన్ని 'అలలు'గా విభజించాడు. ఒక ఆవేశ తరంగంలా, ఒక ఆర్తి ప్రవాహంలా ఒక భావ వీచికలా సాగే ఈ కావ్యం ఒక పద్ధతి, ప్రణాళిక లేకుండా వరదలా పొర్లిందో ఒడ్డున విరిగి పడిందో తిరిగి జలగర్భంలో కలిసి పోయిందో ఏమీ కాదు. మొదటి విషయం కావ్యపరంగా వస్తువు కూడ కలిగి కుందుర్తి లాంటి వారిని కూడ ఆనందపరిచే ఒక కంటిన్యుటీ, కథాసామగ్రి వుంది ఇందులో. అట్లాగే పూర్తి దుఃఖంలో, నైరాశ్యంలో ఆరంభమైన అలలు ఆశలో విశ్వాసంలో వెలుగులు చిమ్మడంగా ముగుస్తుంది. వర్తమానంగురించి అనవసరమైన రంగు రంగుల చిత్రాన్ని ఇవ్వక పోవడంలోనే కాదు భవిష్యత్తును గురించి భయాన్ని కల్పించక పోవడంలో కూడ కవి వాస్తవ దృష్టి వుంది అయితే భావావేశంలో 'దుఃఖం ప్రవహిస్తుంది నా ముంద'ని తాను దుఃఖిస్తాడు కాసేపు కర్తవ్యాన్ని మరచిపోయి రాలుతున్న ఆకుల్నుంచి కూడ రోదనే ధ్వనిస్తుందంటాడు

ఇందులో కొన్ని ప్రతీకల్లాంటి సంఘటనలు చెప్పబడ్డాయి. అవి ప్రతీకలు అనడానికి వీలు లేనంత వాస్తవంగా సహజంగా వున్నాయి. సంఘటనలని చెప్పడానికి వీలులేనంత సర్వసాధారణంగా వున్నాయి. మొదటి 'అల' లో ఎంతో దూరంనుంచి రోగం వస్తే వేసుకొచ్చిన ముసల్ది చస్తుంది. ఆమె శవానికి చీమలు పడతాయి ముసలివాని మాటలు అంతకన్నముందు ఆ దృశ్యాన్ని చిత్రించిన కవికన్నా మనపై ఎంతో గాఢమయిన ప్రభావాన్ని వేస్తాయి! 'నా కోపమంతా దుఃఖమై పోతుంది / దుఃఖమంతా కోపమై పోతుంది.' కవిలో కూడా యీ లక్షణం వుంది. కోపమంతా దుఃఖమైపోయి విహ్వల భావావేశంలో ఆర్తిలో అలలై పోతాడు కాని దుఃఖమంతా కోపమైపోయి చివరన శపిస్తాడు. ఇంకొక పద్ధతిని (శిల్పాన్ని అనాలేమో) కూడా ఇందులో ప్రవేశపెట్టాడు. ప్రతి అలలో,

ముఖ్యంగా ఒక సంఘటన వంటిది చెప్పినపుడు మొదలంతా కానొక వాతావరణాన్ని, దృశ్యాన్ని చిత్రిస్తాడు తర్వాత పాత్రలు వచ్చి తాము మాట్లాడుతాయి. అటువంటి అన్ని సందర్భాలలోనూ పాత్రలు మాట్లాడిన మాటల ముందు, ఆ మాటలలో మన మనసు మీద రూపుకట్టిన స్పష్టమయిన, తీవ్రమయిన భావం ముందు కవి ఎంతో అలంకారికంగా, ఆవేశానికామ్రేడితంగా అల్లుకపోయిన అలలు అలుకుడుగానే కనిపిస్తాయి ముఖ్యంగా మొదటి సాలుగైదు అలల్లోని పాత్రలు- ముసలి వాడూ, 'నా బిడ్డ-నా కళ్ళు, నా ప్రాణం, నా దోత, నా అన్నం, నా జీవం (ఒక్కసారొచ్చి మీ చేతుల్తో పలకరించి పోండి/ వచ్చి మీ చూపుల్తో మందిచ్చిపోండి/వచ్చిమీనిర్లిప్తతతో ధైర్యంచెప్పిపోండి/నాఆత్రతేనేనయి వచ్చానయ్యా) అన్నకన్నకడుపు (అల-2)చెరచబడి కనుమూసిన కన్నె సెలయేరు గురించి హెడ్‌నర్స్‌కలనిప్పులా మండుతోంది, సకలప్రపంచాన్ని కాండ్రించివుమ్మేసింది. (మూతపడిన ఈనీకళ్ళలో ఈదేశసంస్కృతి/హత్యకావించబడ్డనీతో ఈదేశ ప్రజాస్వామ్యం) అట్లాగే ఆయాలు (ఆయా పిల్లలు ఆయాలే/ అడియాసల పిల్లలు అడియాసలే) నర్సులు మొదలయిన కింది తరగతి ఆసుపత్రి సిబ్బంది గురించి వాళ్ళ మాటలతోనే ఎంతో వాస్తవికంగా అయితే భావావేశంతో మొత్తంగా తుడిచివేసే (Sweeping) ధోరణితో చెప్పడమూ, ఒక్కొక్కచోట పూర్తిగా కాల్పనిక ధోరణులలో పడి కొట్టుకపోవడమూ కనిపిస్తుంది. ఊపుకోసం, భావలయ కోసం పునరుక్తిలో పెద్దదోషంలేదు కాని ఒళ్ళు మరచిపోయి పెట్టుకున్న గమ్యాన్ని, లక్ష్యాన్ని వదిలేసి కేవలం ప్రయోగం కోసం, అలంకారం కోసం, భావలౌల్యం కోసం తననుతానే బంధించుకుంటాడు ఒక్కోచోట. భాషలో, అలంకారాలలో ప్రాచీనవాసన కొంతవుంది. రూపకాలంకారాల మోజు కొంచెం శృతిమించింది 'సిళ్ళద్దా నల్లని పక్షిలాగ/ స్పృహ చెట్టుమీద వాలి పొంచి' మురిగిన ఆసుపత్రి గుడ్డును పొదుగుతున్న ఒక నిర్లక్ష్యపు ఎద్దు కోడిలా ఆ మర్రిచెట్టు'-రౌరవనరకం, మేరునగమంతటి బరువు శివారెడ్డినికూడ వదలవా: 'కలువకొలనును మదపుటేనుగు విచ్చిత్తిచేసినట్లు'- ఆముక్తమాల్యదలో వుండాల్సినపోలిక, ఆసుపత్రిగీతంలో కాదు. శివారెడ్డి కళ్ళ సముద్రాలయినాయి 'కొన్ని చేతులు ఎర్ర సైన్యాలవుతాయి. కలలు నిజమవుతాయి !' ...

—'మిత్ర'

# దోపిడీని కాపాడేందుకు సన్మాన కవుల "దీక్ష"

ఎమర్జెన్సీలో-ప్రజాకవులు, రచయితలు, మేధావులు, ఒకవైపు జైళ్ళలో మగ్గుతూంటే, మరోవైపు కుహనా ప్రజాకవులు కొందరు పాలక వర్గాన్ని సమర్థిస్తూ పాటలు రాసారు, పుస్తకాలు అచ్చువేసారు.

"అన్యాయాలూ, అక్రమాలంపై" తిరుగుబాటు చేస్తున్నామని చెప్తూ, ఈ 'తెగులు' కవులు సిగ్గువిడిచి, బద్మాషీకి బహిరంగంగా బాకాలూది, ప్రజా పీడకులు పెంచుకున్న నట విట గాయక గణికలుగా స్పష్టంగా నిరూపించుకున్నారు.

చీకటితో చేతులు కలిపి-ఈ అమ్ముడుపోయిన కవులు- తిమిరంతో సమరం చేస్తున్నామని చాటుకున్నారు. మంటల్లోకి మానవుణ్ణి తోస్తున్నవాణ్ణి కీర్తిస్తూ-మెళ్లో మూర్ఛబిళ్ళల్లా డాక్టరేట్లూ, బిరుదులూ తగిలించుకున్న వీరు-మారణహోమాన్ని నిరసిస్తున్నామన్నారు.

ప్రజల్లో పేదవర్గాల పరిస్థితులు మెరుగు పరచడానికీ, దేశంలో క్రమశిక్షణ నెలకొల్పడానికీ ఉద్దేశించి ఇందిర ఎమర్జెన్సీనీ, ఇరువై సూత్రాల ఆర్థిక ప్రణాళికనూ ప్రకటించిందనీ, యీ చర్యలను సమర్థించమనీ - ఆం. ప్ర. ప్రభుత్వ సమాచార పౌర సంబంధశాఖ (బాకాలూద) "ప్రసిద్ధులైన అనేకమంది కవుల"కు పద్యాలు పంపమని పురమాయిస్తే 17 మంది అమ్ముడుపోయిన కవులు వంత పాడతామని "దీక్ష" పూని పాటలు రాసిచ్చారు. "ప్రభుత్వం పురమాయించిం"దని పద్యం రాయలేను నేను" అనడానికి మయకోవస్కీలా వీళ్ళు? ఒకవైపు "ద్వేషపూరిత ప్రచారం"తో ప్రజా కవులను, ప్రజాశక్తులను దూషిస్తూ, మరోవైపు "ప్రేమను గురించి ప్రచారంచేయ"మని కోరితే- మాగ్జిం గోర్కీవలె కాక- ప్రజలకు ఈవిధంగా బోధించడానికి ముందుకు వచ్చారు వీళ్ళు; "ప్రజలారా ! మీ భూదేవి సిరిసంపత్తి నంతటిని బుద్ధిపూర్వకంగా కొల్లగొట్టి, దోపిడి చేసే పెట్టుబడిదారులను ప్రేమించండి. మిమ్ములను నాశనంచేయడానికి, తుపాకులను తయారుచేసి మీ ఇనుమునంతా నిరుపయోగం చేసే ధనిక వర్గాన్ని ప్రేమించండి. ఎవరి మూలకంగా మీ బిడ్డలు తిండిలేక అలమటించి మృత్యువు వాతబడుతున్నారో ఆ దోపిడి దొంగలను ప్రేమించండి. శమ శాంతి

కోసం, తమ సుఖం కోసం మిమ్ముల‌ను సర్వనాశనం చేసే ఆ క్రౌర్యలను ప్రేమించండి. మిమ్ములను అజ్ఞానాంధకారంలో ముంచివేసే పెద్దలైన పెట్టుబడి దారులను ప్రేమించండి."

అధికారంలో ఎవరుంటే వాళ్ళను కీర్తించడం తెలుగు కవుల్లోని ఒక ముఠాకు అలవాటైపోయింది. ఈ ముఠాలోని నాయకులు దేశనాయకులుగా చలామణి అవుతున్న ప్రజాపీడకులకు తమ కావ్యాలు అంకితం యిచ్చి సన్మానాలు చేయించుకోవడం సామాన్యమై పోయింది. ప్రభుత్వం చేసిన ప్రతి చర్యనూ సమర్థిస్తూ పోటీలుపడి కవిత్వం రాసి వేదికలెక్కి కక్కుతున్నారు. ఈ కవులు; దోపిడీ వర్గాలకు కావలి కుక్కలుగా, వంది మాగధులుగా బ్రతుకుతూ ప్రజా ధనాన్ని మరోవిధంగా మెక్కుతున్నారు.

ఎమర్జెన్సీ ప్రకటించి వందరోజులైన 'శుభ' సందర్భంగా అక్టోబర్ 75లో అచ్చయింది "దీక్ష". ఈ "దీక్ష" "స్ఫూర్తి"తో-యింకొందరు యువ కవకవులు 'ఎమర్జెన్సీ' పోలేదింకా" అని చంకలు కొట్టుకుంటూ- కవితా సంకలనాలను అచ్చువేసారు. వీటిల్లో-యువసాహితీ సమితి, సికిసిల్లవారు ఏప్రిల్ 76లో ప్రజల పైకి ఎక్కుపెట్టిన "ఇరువై రంగుల ఇంద్రధనుస్సు" ఒకటి; "దీక్షా" గురువులైన యిద్దరి కాళ్ళ చెంత యింకో పద్దెనిమిది మంది చేరి, "వింశతి కవుల" మంటూ నియంతకు వంత పాడారు.

దీక్షితులకు నాయకత్వం వహించినట్టుగా ముందు నడిచాడు దాశరథి :—

"వీరనారి-మన ఇందిర
విజయ శంఖమూదిందిరా !
ప్రజాస్వామ్యమును పడద్రోసే
వారిని అణచేసిందిరా !" అంటూ,

ధనస్వామ్యమంటే ఏమిటో, జనస్వామ్యమంటే ఏమిటో తెలియని అజ్ఞానులు జనులు అనుకొని, పురోగమనం పేరున ఎట్లా తిరోగమిస్తున్నాడో చూడండి ఈ "తిమిర" కవి :-

"ధన స్వామ్యమును ముందుకుతీసి
జన స్వామ్యమును వెనకకు తోసే

తిరోగాములను ఛిత్కరించి
పురోగమించెను ఇందిర."

ఎవరికి శాంతిని నెలకొల్పిందో, ఏ పీడిత ప్రజకు అహింసా మార్గాన్ని బోధించిందో, ఏ సూత్రాలు సుతారంగా సామ్యవాదాన్ని ప్రక్కదారులు పట్టించినవో తెలిసి కూడా తెలియనట్లు స్తోత్రం చేస్తున్నారు :-

"శాంతి అహింసల సవ్య మార్గమున
సామ్యవాదమును సాధించుటకు
వింశతి సూత్ర ప్రణాళికలను
వేసెను ప్రధాని ఇందిర."

ధన స్వామ్యాన్నీ, ఫాసిస్టులనూ, దుష్టశక్తులనూ తుదముట్టించడానికే ఇందిర పాటు పడుతున్నదనీ, "రైతూ, కూలీ, మేధావీ" "తమ చైతన్యమును చూపించి" ఇందిరను కాపాడమని ఈ 'మేధావి' కోరుతున్నాడు. చైతన్యం పొందిన రైతూ, కూలీ, మేధావీ యిందిరను, యిందిర జట్లనూ బలపరచరు. చైతన్యమంటే చేతకానితనం కాదు, చీకటికి చేతులు జోడించి యిందిరవర్గం కాళ్ళు నాకడం కాదు. మేధావులుగా చలామణి అవుతున్న మోసగాళ్ళను -

"దేశం అణువణువునా
హరించుకు పోతూంటే
మీరేం చేస్తున్నారని
సంజాయిషీ అడిగే రోజొకటి
వస్తుంది."

"అబద్ధాల నీడల్లో విహరించే వాళ్ళ ఆత్మ సమర్థనల్ని ఎవరూ ఒప్పుకోరు" (ఒతో - రెని - కస్తియో్స)

మారుతీ కారెక్కిన ఈ నగర్వాలాకు టర్క్‌మన్ గేటు దురంతాలలో లోక కల్యాణమే కనిపిస్తుంది; సింహాసనం కాపాడుకునేందుకు "అనివార్యమైన కుదుపు" "హేయశక్తులకు అదుపు" గానే అనిపిస్తుంది.

"ప్రజావళిని హతమార్చే
భయంకర విషవాయువును

బంధించే ఆదిశక్తి
పట్ల - ప్రజకు కలదు భక్తి"—

అని— ప్రజల జీవనాడిని పట్టి చూసిన వాడిలా - ప్రజల తరఫున చెపున్నాడు ఈ కవి. ఎవరు ఎవర్ని హతమార్చిందీ చూస్తూ కూడా, భక్తితో 'ఆదిశక్తి' మెప్పు సంపాదించడం కోసం కవిత్వాన్ని బలిపెట్టిన ఈ 'మహాకవి' సృష్టించే విషవాయువులో కొట్టుకు పోయేంత మూర్ఖులు కారు ప్రజలు.

"పలుకలేను కవిత్వ భాషలో ఈ పూట
పాడుతా గొంతెత్తి వేడి నెత్తుటి పాట"

అంటూ- ఎమర్జెన్సీలో కాలువలై పారిన రక్తాన్ని చూసి సాడిస్టిక్ సంతోషంతో గొంతెత్తి పాడిన సి. నారాయణ రెడ్డికి -

"మహాకవివై పూట గడుచు
మాటాడకు.
కలం గారడీ కైతల
వల అల్లకు"- అని చెప్పి ఏం ప్రయోజనం?

అద్దంలో తనను తాను చూసుకుంటూ

"కాకాలు బాకాలు
ఆ పైన బిరుదాలు
అటు కాలు యిటు కాలు
అవకాశ వాదాలు"

అని వర్ణించుకొని, ఎక్కడో వున్నాయని దుష్టశక్తులను, గోడ మీది పిల్లులను గేలి చేయడానికి రాసినట్టుగ చెప్పుకుంటున్నాడు. అవకాశవాదాల సినారె వారు తీసుకున్న "దీక్ష" సంగతి "రాదలేని విప్లవం రూపొందు నేలలో" వున్న "అభిమాన సంఘాలు" వారి చెవిన పడలేదేమో వాళ్ళు ఆయన ఎమర్జెన్సీని సమర్థించ లేదని అనుకున్నారు.

"అటు నుంచి దిగుతున్న ఆకు పచ్చని నోట్లు
... ... ...
ఇటు నుంచి వస్తున్న ఈ టెలూ బుల్లెట్లు"

ఎవరి వర్ణన యిది? రెండర్థాల పాటలు రాసి సినిమా రంగం నుంచి నోట్లు దింపుకుంటూ; 'తెగులు' సభలకూ, సర్కారీ సంతర్పణలకూ అనధికార అస్థాన కవిగా అక్షరాల గవాక్షాలు తీర్చి, ప్రజల నుంచి రక్షణకై పాలక వర్గం పంచన చేరిన వంచకుని వర్ణన కాదా యిది?

ఇందిర ఓటమితో—

"గుంట నక్కలకు మొదలంట మోసం వచ్చె
తోడేళ్ళకేమో హతోస్మి అను స్థితి వచ్చె"

అని కొంచెంగానైనా అనుకోకూడదా? ఈ గుంట నక్కలనూ, ఈ తోడేళ్ళనూ గుర్తించని గుడ్డివాళ్ళా ప్రజలు?

ఉద్యోగాలు కోల్పోయిన ఉద్యమ కారులెందరినో చూసి "పని దొంగ లేకంగ డిస్ మిస్" అంటున్నారు సినారె, వెంగళ రావు పోజులో. ఎవ్వరినో చూడకపోతే మానె, ఎమర్జెన్సీ పుణ్యాన ఉద్యోగాలు పోగొట్టుకున్న నగ్నముని, శ్యామ సుందరరావు లాంటి రచయితలను పనిదొంగల క్రింద లెక్క కట్టే ఈ "దొర" నేమనాలి?

విశ్వనాథ లేకుంటే ప్రపంచమే తలక్రిందులవుతుందని అనగలిగిన చైతన్య స్వరూపుడైన అభ్యుదయ కవి పిడుగుపాటులా పడ్డ ఎమర్జెన్సీని "నడిరేయి వెలిగింది నవ చేతనా జ్యోతి" అని కీర్తించలేడా?

'నేటి పాట' పాడిన "సినీ పాట గమ్మత్తుల సినారె"ను పట్టుకొని కాళోజి క్షేమగ్గానే అన్నాడు :-

"ప్రజల కష్ట సుఖాలండీ
పాటలు కావుర కొడుకా!" అని.

కాకపోతే, పేద ప్రజల గుడిసెలను పీకివేస్తూ, కుటుంబ నియంత్రణ పేర పశువులను కోసినట్టుగ కోస్తూ, నిరాయుధులైన వీరులను పట్టుకొని, ఎన్‌కౌంటర్ల పేర పిరికిగా, దొంగదాటుగా కాల్చి చంపుతూ, 'అన్యాయం' అన్న వాడినీ, అతని బంధు మిత్రులనూ బంధించి, హింసిస్తూ కొనసాగిన మారణహోమాన్ని, ఐద్మాక్షిని, ఈ విధంగా కీర్తిస్తాడా :-

"ఈ వినూత్న స్థితికి ఎవరు కారకులు?
ఈ శర పురోగతికి ఎవరు సారథులు?

ఎవ్వరయితే నేమి ఎందుకయితే నేమి
ఒక్కరయితేనేమి పెక్కురయితే నేమి
చక్కబడ్డది జాతి చిక్కబడ్డది నీతి"

శ్రోతలను సహృదయులుగా పొగిడి, తను దేశ పరిస్థితిని చాలా రమ్యంగా వర్ణించినట్టు చెప్పి వుబ్బిపోతున్నాడు. వీరులు అన్యాయాలు, అక్రమాల్ని అణచ ఆవేశపరులయితే, భీరువు వాళ్ళ పోరాటాన్ని అణచడానికి "ఆవేశ" పరదవుతాడు :-

"ఇది మారుతున్న నా దేశం
ఇది పొంగుతున్న ఆవేశం
చెప్పండి సహృదయులు మీరే
ఇంకేమి పలుకును సినారె?"

ప్రభుత్వం చేయించిన బంగారు పంజరంలో కులుకుతున్న చిలుకఇం కేమి పలుకుతుంది?

1975 జూన్ 25 మధ్యరాత్రి వేలకొద్ది ప్రజలను పట్టుకోవడానికి వచ్చిన కుక్కల అరుపులు విని "కొక్కరో, కో" అనుకున్నాడు బోయి భీమన్న. "కోట్ల జనములు మేలుకొన్నారు" అంటున్నాడు. ఎందుకు మేల్కొన్నారో వాళ్ళు? అర్ధరాత్రి తమపై విరుచుకు పడిన ఉపద్రవం ఏమిటని కలవరపడి కలత నిద్రలో మేల్కొన్నారు ప్రజలు. అప్పుడు కూసింది ప్రభుత్వకోడి భీమన్న లాంటి ప్రభుత్వ వైతాళికులకు అది ఉషస్సు అపుడు—

"కల లెల్ల పండి కో
కిల పిల్చె చెట్లపై" అంటున్న కవి కోకిలకు—
"తిన్న తిండెవ్వారిదే కోకిలా!
పాడు పాటెవ్వారిదే కోకిలా!"

అని ప్రజలు నిలదీసి అడుగుతారన్న జ్ఞానమే లేదు.

"పూర్వ దిక్కున, పూర్వ
పుణ్యమే దిక్కుగా
ఉదయేండి రదె వెలసె
హృదయ మర్పించరా"

అంటున్నది ఈ కోకిల ఎన్ని హృదయాల మీద పోలీసుల బూట్లు నాట్యం చేసాయి। భర్తలనూ, బిడ్డలనూ అర్పించి "కాళి"ని తృప్తి పరచిన హృదయాలెన్ని।

"సర్వ సమతా మాత
స్వాగత మ్మి వచ్చె"
"అభ్యుదయ దేవి నీ
ఆతిథ్య మాశించె"—

అని కీర్తించే "కనుమూసి పాల్దాగివు పిల్లి" యొక్క "గుహ లెల్ల చీల్చి చెండెడు" ప్రజలున్నారని మరవకూడదు. "ఇరువదమ్మూల విల్లు"నే కాదు ఆ విల్లు రాసిన 'విల్లు'ను (వంశ పారంపర్య పాలనా వీలునామాను) కూడా తగులబెడతారు.

జె, బాపురెడ్డికి ఇందిర ఇరవై సూత్రాలు "ఇరువయి రంగుల ఇంద్ర ధనుస్సు"గా కనిపించింది. ఇంద్రధనుస్సులో ఏడు రంగులే వుండే అశాస్త్రీయం। ఈయన వద చిత్రాల్లో ఇంద్రధనుస్సుకు ఇరవై రంగులు పులిమాడు.

"ఈ ఇరువయి రంగుల ఇంద్రధనుస్సు
అపూర్వ పర్వాభ్యుదయ మహస్సు"
"మార్పుకు స్వాగతం పట్టిన మహోజ్వల జ్వాల
ఎద ఎదలో పరిమళించే ఈ ఇంద్ర ధనుర్హేల"అని అంటున్నాడు.
"ఇరవై రంగుల ఇంద్రధనుస్సు
ఈ దేశాన్ని పాలిస్తున్నది"—

ఎంత 'శ్లేష'గా "మహత్తర చరిత్రను చిత్రిం"చాడు। ఇరువై కుటుంబాలు కావా ఈ దేశాన్ని పాలిస్తున్నవి?

"పసివాళ్ళను చదువు తల్లికి దూరం చేసి
యువకుల్ని ఉద్యోగలక్ష్మి వియోగుల్ని చేసి
కొందరికి గూడు లేకుండా చేసి
ఎందరికో కూడు లేకుండా చేసి
భరతజాతి జీవన ప్రాంగణంలో
ప్రళయ తాండవం చేస్తున్న

దారిద్ర్య పిశాచం"

ఎవరు? ఇందిర కాదా? నెహ్రూ, ఇందిర సంజయ్ అవతారాలెత్తిన భూస్వామ్య పెట్టుబడిదారీ వ్యవస్థ కాదా?

సూర్యకాంతితో పుట్టి, సూర్యునికి వ్యతిరేక దిశలో వుండి, సూర్యుని కంటె గొప్పదాన్ననుకొనే ఈ ఇంద్రధనుస్సు ఏం సూచిస్తున్నది? "పాలు పోసి పెంచుకున్న విషసర్పాన్ని."

పేరులో కూడ ఫ్యూడల్ వ్యవస్థకు ప్రాతినిధ్యం వహిస్తున్న "దేవిప్రియ" "వృషభరాజా, భక్తులు చేసిన ఊరేగింపు" చూసి -

"అంతా రండి
ఒక కొత్త ఊరేగింపు బయలు దేరింది"— అంటున్నాడు.

"వృషభ రాజు మ్రోల సాగిలపడు దండాలు
వేకువ కోదండానికి వేసిన అరదండాలు"
"వృషభ రాజ భక్తి చేసే ఊరేగింపు
అరణ్యం ఆలోచనపై సాగే గాలింపు
నగరాన్నే జోకొట్టే నల్లమందు లాలింపు"—

అని ఒక ప్రజా కవి చక్కగా ఈ ఊరేగింపును వర్ణిస్తే, "దేవిప్రియ" కళ్ళకు ఇది "స్పందించే గుండెలూ, ప్రజ్వలించే మంటలూ" చేరిన ఊరేగింపుగా కనిపిస్తున్నది!

దేశాన్ని మట్టికరిపిస్తుంటే
చూస్తూ ఊరుకోడం
అందరికీ చేతగాదు"—

అంటున్నాడు, నిజమే, మట్టికరిపించే వాళ్ళమీద కీర్తనలు రాయాలా? ఎమర్జెన్సీ ఎత్తేయగానే, "అడవీ! నిన్నే నమ్ముకున్నా" ననాలా? "ఢిల్లీ...వదలిన...బాణా"లన్నీ (ప్రజలమీద "మళ్ళీ" ఎక్కుపెట్టడానికి?) భద్రంగా వుంచమని అడవిని కోరాలా?

"ఋతువు ఋతువుకి కొత్తవేషం"
..తొడిగే "గురుల వేదం"

"గాలి వాలును బట్టి పడవల
దారి మార్చే భ్రష్ట వాదం"—

లో "దేవిప్రియ" కూడా పడిపోయాడా ? ఆయనే చెప్పిన పద్ధతిలో—

పది మందిని నమిలితిన్న
సింహాలను తిట్టక
తమాష చూస్తున్నారె !
కవులుంది యిందుకా ?

"ఢిల్లీ" నుంచీ, "కోట బురుజు మీంచీ" విప్లవం దూకదనీ; పల్లెనుంచి ప్రాకి అది, పేటల్ని చుట్టి, కోటల్ని కూలుస్తుందనీ— "దేవిప్రియ" గుర్తించాలి. "నలుగురూ నడవగల దారి కోసం వెతుకగల "దేవిప్రియ" ఊరకుక్కల "ఊరేగింపు"లో చేరి, "తడిగుడ్డతో" "రేపటి వెలుగు" "గొంతు" కోయ డానికై ప్రజల "దారిలో అడ్డు నిలవొద్దు."

అంబికా సోనీలు, రుక్సానాలు సంజయ్‌కి మోహినిలా కనిపిస్తే, పరిమళా సోమేశ్వర్‌కు ఇందిర "మోహినిలా" కనిపించింది. హుస్సేన్ కాళిలా ఇందిరను చిత్రిస్తే పరిమళ "భద్రకాళిలా" ఆమె పద చిత్రం గీసింది :—

"భస్మాసురుల నెత్తిన చేతులుపెట్టే మోహినిలా
ప్రగతి పథంలో పరుగులు తీస్తున్న
ప్రజాస్వామ్యానికి సడన్ బ్రేకులు వేసే
తిరోగామి శక్తులను తుత్తునియలు చేసే భద్రకాళిలా
విజృంభించింది ఇందిరా ప్రియదర్శిని"—
"పీడిత ప్రజల వరంలా వచ్చింది ఎమర్జెన్సీ"—
"వెంట తెచ్చింది ఇరవై అంశాల ప్రణాళికను"— అంటూ—
"రోటీ కపడా ఔర్ మకాన్
లభిస్తాయి వన్ చీపర్ రేట్స్"

అని రాసి, త్రిభాషా సూత్రంలో ఇరవై సూత్రాలను ఇరికించి గానం చేసారు ఈ 'అరసం' కవయిత్రి, మన "అందాల చీరలకు ("సంస్కృతికి") ఇందిర "అద్దుతారు మతిన్ని రంగులు" అంటూ మురిసిపోయారు ఈ మగువ.

"మీ సొంత ఆస్తినే కాదు, బేనామి ఆస్తినికూడా
వశపరచుకొనే దాకా ఊరుకోరు ప్రజలు"

అనే మాట మాత్రం నిజం. "మీరు" అంటే ఎవరు ? ప్రజలకు తెలుసు.

"గట్టిగా అరిస్తే, వేస్తాం సినోటికి తాళం" అంటున్న "వంద గుళ్ళు కట్టించిన పుణ్యం" ఆశించే మందికి చెప్పగల మాట ఒక్కటే (అపెదే ఆ మాట) :—

"చెప్పు జానిస బ్రతుక్కి-క-గుడ్‌బై "
"జన జీవనాన్ని ఝంఝూవృతం చేసిన
పత్రికల్ని ...
బుట్టలో బంధించిన ఈ దినం
నీకూ నాకూ నేడు పర్వం"—

అంటున్న "తథాస్తు" మునిసుందరం—

"సామాన్యుడు కోరేది హక్కులుకాదు
కూడూ, గుడ్డా, గూడు"

అని వెర్రి సిద్ధాంతం ఒకటి ప్రతిపాదిస్తున్నాడు. "వాక్ స్వాతంత్ర్యం అన్నం వండిపెట్టదు" అని ధీమాగా చెప్తున్న ఈ దీక్షా పరుడు తన ఈ వాక్కును ఏ హక్కుతో ప్రజల చెవుల్లోకి దూరుస్తున్నాడో మరి !

నౌబత్ పహాడ్‌పై వెలసిన బిర్లా వెంకటేశ్వరస్వామి పురమాయిస్తే రాసినట్టు, ముదిగొండ వీరభద్రమూర్తి ఎమర్జెన్సీ "వంద లాభాలను" "యీ యెల్లన్నీ దయ మాకు జాగృతియు నయ్యెన్ వేంకటేశ ప్రభూ !'' అంటున్నాడు. సంజయ్‌దేవుడు (తనను మరచినందుకు) ఈ కవిని క్షమించుగాక !

"బ్రతుకు బ్రతికి మరో నాల్గు బ్రతుకులు వెలిగించే వరప్రసాద శాసనం" అని సువార్త వినిపిస్తున్నాడు పి. ఎస్. ఆర్. ఆంజనేయ శాస్త్రి ఇక్కడ బ్రతుకు ఇందిరడీ; నాల్గు బతుకులు-దుష్టచతుష్టయంలోని ఓం, సంజయ్, బన్సీ, శుక్లాలవీ. "అమ్మకోలేదు. నమ్ముకున్నాననగలిగిన అనృత స్వేచ్ఛ కోసం పోరాటం" సాగించిన ఆంజనేయులవారు తాము అమ్ముడుపోలేదని

చెప్తున్నారు. పోరాటం శ్రీరాముడు మాత్రం వీరినీ, వీరి "అమ్మ"నూ నమ్మకొని లేరు.

"ఇందిరా మందిరం"లో పవళించిన 'అసూనా' "సర్కారు ఖర్చుతో స్వంత రాజ్యము పెంచు సుల్తాన్ల"ను చూసి "బాపూజీ కలలుగన్న భారతావని యిదియేనా!" అని "స్వప్న సీమ"లోంచి అడుగుతున్నాడు, "సిద్ధార్థుని గన్న తల్లి చివరి కిట్టులమారేనా!" అని విలపిస్తున్నాడు, బాపూజీ బోసి నవ్వులు బోడి రాజ్యాన్నే సృష్టిస్తాయని తెలియదు, పాపం!

ఇంకా-వేటూరి ఆనందమూర్తి "రాకాసిగా దిగజారి, ఖుర్ర వెర్రితలలు వేయడం", జ్యోతిర్మయి "ముసురుకుంటున్న మూర్ఖత్వం". తల్లాప్రగడ భ ది రాజు "కులతత్త్వపు జులుము", "విహారి & శాలివాహన"ల "ఇందిర & మేనక గృహలక్ష్మి తీహూ పథకం," ఉత్పలవారి "సీమ నుంచి తెప్పించిన సారా" గుత్తికొండ సుబ్బారావు "ఇందిర పలికిన (ఎంగిలి) పలుకు"-మనకు "దీక్ష"లో సాక్షాత్కరిస్తాయి.

ఇందిరకు-పురాణ కవుల్లా-ఇంద్రత్వాన్ని ఆపాదించి, ఈ సన్మానకవులు ఆమె సింహాసనం నిలపాలని కలలు కన్నారు. ఇంద్రత్వాన్ని నిలుపుకోవడానికి పురాణాల్లో ఇంద్రుడు ఎన్ని నీచకార్యాలకు ఒడగట్టాడో ఇందిర అంతకన్నా ఘోరాలు చేసింది. ఆ పురాణ కవుల్లాగే వీరికీ అవే అభ్యుదయంగా కనిపించింది.

"బాధ్యతా రహితముగ నోటికి
వచ్చినటు లేదైన వదరుట
కల్ల నిజ మెన్నకయ చేతుల
కలవనుచు నేదైన వ్రాయుట"-

అని-దివాకర్ల వేంకటావధాని గారు "దీక్షా"కవుల 'తాత్వికత'ను స్పష్టం చేసారు.

వేయి పడగల్లో మిగిలి పోయిన పడగలు "ఇరువై రంగుల ఇంద్ర ధనుస్సు"లోంచి విషం కక్కాయి

ఎమర్జెన్సీలో ఇందిరను చూసి "అర్ధరాత్రి సూర్యుడ్ని" చూసాననుకొన్న జక్కని వెంకటరాజం "సాగుతున్న పోరాటం"లో "అవినీతితో చేతులు కలి" పాడు

"అభ్యుదయం సాధించామని
చెప్పుకోవడం సిగ్గుచేటు"-

అని గతం గురించి చెప్పిన ఈ "పాతకాలపు" కవి ముప్పయ్యేళ్ళ పాలనలో అభ్యుదయం జరగకపోవడానికి కారణం చెప్పక, "ఇరువైసూత్రాల్లో ఇమిడివున్న అభ్యుదయం కోసం" "ప్రతిపౌరుడూ పాటుపడాలి" అని చెప్పడం సిగ్గుచేటు.

"తమ్ముడూ! లే! లే!
అమ్మ రమ్మంటోంది"-

అని రాజన్‌లనూ, జనార్ధనరావులనూ అర్ధరాత్రి లేపి, పిలుచుకుపోయి "ఇందిరా ప్రియదర్శిని"కి బలియిచ్చిన కరుణాకరన్, వెంగళప్పలను "దీపశిఖలు" అంటున్న కనపర్తి ప్రజల ఆర్తిని కనలేదా?

"నిజంలో మునిగితేలిన నా అక్షరాలను క్షమించండి" అని అబద్ధపు మాటలు చెప్తూ, ఆత్మద్రోహాలను కాపాడడానికి పూనుకున్న తొప్పుకట్ల చంద్రమౌళి-

"చెవులకు వినిపిస్తున్న ప్రగతి సూత్రాలు
కండ్లకు కనిపిస్తున్న పేపరులోని నీతిశాస్త్రాలు"

విని, చూసి, "అందలమెక్కినవాడి" "ఊహల ఉయ్యాలలో" "కలాలగళాల" నూపి-

"నేటి పరిస్థితుల పద్యాల్లోని థియరీకి
పూర్తిగా అన్వయం కుదరడం లేదు
అర్థం దొరకడంలేదు"—

అని అంటున్నాడు "కట్టుకథలకీ, పెట్టుబడికీ పుట్టిన విషపుత్రిక"లైన పత్రికలనూ, అవకాశవాణినీ నమ్ముకొని "కక్కిన" కవిత్వం యొక్క—

"ఈ చప్పుడుకు చింతకాయ రాలదు."
"చీకటిలో మసలుతూ
వేకువనే మింగుతూ
నీతినీ - మన జాతినీ నిలువునా దోచేసిన"-

"ఇరవై సూత్రాల ఇంద్రాయుధం" "ఈ దేశానికి రక్షగా" నిలువలేదని వడ్డెపల్లి కృష్ణ గుర్తించాలి. 'ఇంద్రాయుధం' చూసే రైళ్లు నడవలేదు, జైళ్లు నోళ్లు తెరిచి ప్రజల్ని మింగాయి, 'ఇంద్రాయుధం' చూపించే పోస్టాఫీసులను తెరవలేదు, కష్టజీవులను ఉరితీసారు.

ఇంకా పద్యాలుగు 'యువస్వరాలు' 'అంతర్మథనం' చెందకుండా, 'కనరా నీ దేశం'యొక్క ప్రగతి అని "వెలుగుమేడ"ను చూపిస్తున్నారు. అందులో - "దీపశిఖల"ను ఆర్ప ప్రయత్నించి విఫలురాలై చావడానికి సిద్ధంగా వున్న 'పరాజిత' నిజ స్వరూపానికి రంగులు పూసి కనబడకుండా చేస్తున్నాయి. "ప్రజలను కర్తవ్యోన్ముఖులను చేయుటకై ఒక ముఖ్య సాధనము కవిత్వము" అని నమ్ముతున్న ఈ యువస్వరాలు ప్రజల నుంచి పలుకాలి, ప్రజల కోసం నిలవాలి. అమ్ముడు పోయిన కవుల అడుగుజాడల్లో నడవక- ఆవు దూడలుగా, కర్షకునిగా, మరోలా కనిపిస్తున్న తోడేళ్ళనూ, పులులనూ నమ్మకోక - పొరపాట్లను దిద్దుకొని - వీళ్లు ప్రజాపంథాననుసరిస్తారని ఆశిద్దాం.

ఇరవై ఠంగుల జరిగిన దోపిడీని చూసి దీక్ష పూని రాసిన కవిత్వానికి ఒక మచ్చుతునక :-

"మన కొంప లార్చిన మన స్త్రీల చెరచిన
మన పిల్లలను చంపి మనల బంధించిన
మానవాధములను మండలాధీశులను
మరచి పోకుండ గురుతుంచు కోవాలె
కసి ఆరిపోకుండ బుసగొట్టు చుండాలె
కాలంబు రాగానె కాటేసి తీరాలె." (కాళోజి)

"ప్రపంచాన్ని దోపిడి చేసి అలసి పోయిన వాళ్ళనూ, తమ దోపిడి ప్రణాళికల ఫలితంగా నానాటికి తీవ్రతరమవుతూన్న శ్రామికవర్గ ప్రతిఘటనతో వ్యాకులపడే వాళ్ళనూ, అంతులేని లాభాలు సంపాదించాలనే దురాశతో ఉన్మత్త భీషణ రూపం దాల్చి సంఘ వినాశకారులుగా తయారైన వాళ్ళనూ, బలపరచడం లేక కాపాడడం కేవలం నిరర్థకమే కాకుండా, ఆ బలపరచే వాళ్ళకు కూడా అది ముప్పు తెచ్చి పెడుతుంది" - అనే (గోర్కీ) మాటల్ని, "కళావేత్తలారా ! మీరే వైపు?" అనే ప్రశ్ననూ కవులు గుర్తుంచుకోవాలి. (ఇది మరిచిన) కవులు, బ్లాక్ పాంథర్స్ చెప్పినటు, "పరిష్కారంలో భాగం కాకపోతే సమస్యలో భాగం గానే" మిగిలిపోతారు ; ప్రజా పోరాటంలో ప్రజాద్రోహులతో పాటు వాళ్ళు కూడా అంతమై పోతారు.

—జీ. డి.

# పునరంకిత మవుతున్నాం

—ఎ. ఆర్.

వందనాలు వందనాలు రామ నరసయా
విప్లవాభి వందనాలు రామ నరసయా
కామ్రేడ్ రామ నరసయా
మావ్ సేటుంగ్ ఆలోచన ప్రజాయుద్ధ వెలుగుల్లో
భారతదేశ పరిస్థితికి పథమిది యని చూపిస్తూ
సాయుధ పోరాట జండ ఎగరేసిన యోధుడా !

॥ వందనాలు ॥

పాలక వర్గాల తీవ్ర నిర్బంధాన్నెదుర్కొంటు
గిరిజన రైతాంగ సమర విజయాలను నిలబెట్టగ
సాయుధ ప్రతిఘటనోద్యమ నిర్మాతా, జననేతా ॥వందనాలు॥

జనరక్తం తాగి తాగి జలగల్లా తెగబలిసిన
పాలకులధికారులు మిము చీకటిలో కాల్చిచంపి
చంపినట్టు చెప్పుకున్న లోకానికి తెలిసింది
ప్రజ కన్నీరొదిలింది ॥వందనాలు॥

విప్లవమే జయించునని ప్రజారాజ్య మొస్తుందని
మీరిచ్చిన నినాదాల సింహనాద కంఠధ్వని
ఊరూరా వినిపిస్తూ ప్రజల మేలుకొలుపుతుంది. ॥వందనాలు॥

ఈ చీకటి తొలగిస్తూ జన విముక్తి కలిగించే
నీ ఆశయ సిద్ధి కొరకు పునరంకితమౌతున్నాం
వందనాలు వందనాలు రామనరసయా
విప్లవాభివందనాలు రామనరసయా
కామ్రేడ్ రామ నరసయా

**

కలాలకు సంకెళ్ళు :

## "ప్రభంజనం" సంపాదకుడు డాక్టర్ ఎం. వి. రమణారెడ్డి యావజ్జీవ శిక్ష పూర్తిగా రద్దు చేసి వెంటనే వదిలి వేయాలి.

ఖమ్మం పాణిగ్రాహి నగర్‌లో విరసం ప్రథమ మహాసభలు జరుగుతున్నాయి. 1970 అక్టోబర్ 8, 9 తేదీలు. వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసాలను కాల్చి చంపిన గాయం ప్రజల్లో ఇంకా పచ్చిగా వుంది. సత్యం చావదు, సత్యం చావదు అనే నినాదాలు ప్రజల ఊపిర్ల నుంచి గాలికి ప్రాణం పోస్తున్నాయి. 'సత్యం, కైలాసాలను వధ చేసినందుకు పోలీసు మంత్రి వెంగళరావును బోనెక్కించి విచారించాలి' అని తాటికాయంత ఎక్షరాలతో మధ్య పేజీలలో రాసింది ఒక పత్రిక. ఎంత సాహసం. అదికూడ 1970లో. అవును ఆ సాహసం 'ప్రభంజనం' చేసింది. ఆ రాజకీయ పక్షపత్రిక సంపాదకుడే డాక్టర్ ఎం. వి. రమణారెడ్డి, ఆ సంపాదకీయం రాసిన నేరానికి, అది లగాయతు పాలకవర్గాలకు వ్యతిరేకంగా రాస్తూవచ్చిన నేరాలకు ఆయన ఎన్నోసార్లు జైలుకు పోయాడు. ఎన్నో తప్పుడు కేసుల్లో ఇరికించబడ్డాడు. చివరికీనాడు ఒక హత్య కేసులో యావజ్జీవ కారాగారశిక్ష అనుభవిస్తూ రాజమండ్రి సెంట్రల్ జెయిల్లో వున్నాడు. ఆయన రాజకీయాలేమైనా కావచ్చు, ఆయన ప్రధానంగా రచయిత, శక్తివంతమయిన పత్రికారచయిత. "ప్రభంజనం" పత్రికతో పరిచయమున్న ఏ పాఠకుడైనా, ఆయన అభిప్రాయాలతో ఏకీభవించని వారైనా ఈ విషయం అంగీకరించకుండా వుండలేరు, మొట్టమొదట జులై 80, 1971లో అరెస్టు చేసి ఒక బాంబు ప్రేలుడు కేసులో ఇరికించారు కొన్ని నెలల కారాగార వాసం తర్వాత కోర్టు ఆ కేసే కొట్టివేసింది. 71 డిసెంబర్‌లో ఇండియా - పాకిస్తాన్ యుద్ధం సందర్భంగా మీసా కింద అరెస్ట్ చేసి బంగ్లాదేశ్ ఏర్పడినాక వదిలేసారు 74లో మీసా కింద అరెస్ట్ చేసారు. కోర్టు వదిలేస్తే, కేసులో బెయిలు తీసుకుంటే, ఎమర్జెన్సీ కలిసొచ్చి మళ్ళీ మీసా కింద అరెస్ట్ చేసారు. ప్రొద్దుటూరులో ఒక మాజీ ఎం. ఎల్. ఎ ను హత్య చేయించాడన్న నేరం మోపుతూ కేసు పెట్టారు. ఎమర్జెన్సీలోనే ఈ కేసు విచారణ జరిగి యావజ్జీవ శిక్ష పడ్డది. ఇప్పుడీయన రాజమండ్రి సెంట్రల్ జెయిల్లో వున్నాడు. వృత్తి - వైద్యం వ్యావృత్తి - పత్రికారచన. ఆరోపణ - కుట్ర, హత్య. నేరం-రచన. ●●●

— సంపాదకుడు.

D. Dis. No. C3/9330/75

Office of the Collector
Warangal District
Dated : 25-7-1975

From
Sri M. B. Balaraj, I.A.S.
District Collector
Warangal.

To
Smt. P. Hemalatha
Editor "SRJANA"
Warangal.

Madam,

Sub :- NEWS PAPERS : Publication of 'Srjana' Telugu monthly magazine - Stoppage of publication - Return of original manuscript relating to July, 1975 - Issue-Regarding.

Ref :- 1. Application from Smt. P. Hemalatha, Editor received on 2-7-1975.
2. Application dated: 25-7-1975, from Smt. P. Hemalatha, Editor, "Srjana", R/o Hanamkonda.
3. Application dated : 25–7–1975, from Smt. P. Hemalatha, Editor, 'Srjana' r/o Hanamkonda.

Through the application first cited you have applied for permission to publish 'Srjana' issue for July, 1975 duly enclosing the manuscript copies of articles. In your applications 2nd and 3rd cited you have informed that you are stopping the publication of 'Srjana' from July, 1975 issue including July, 1975 issue onwards and requested this office to return the manuscript copies of the articles for returning to the authors concerned.

In view of your request I am returning herewith the manuscript copies of the articles (as per list) and you are hereby advised not to publish the said issue either by way of cyclostyled or lithographed failing which necessary action will be taken under rules.

Please acknowledge receipt of manuscript articles.

Sd/- G. Hanumantha Rao
P. A. to Collector, and Addl.
District Magistrate, Warangal.

/f.b.o./

Sd/-
Section Head.

Copy forwarded to the D. I. G. Warangal for information

Copy forwarded to the S. P. Warangal

Copy forwarded to the Proprietor, M/s Venkataramana mudranalayam, JPN Road, Warangal.

//true copy//

SRJANA Telugu Monthly Aug. '77 H/WL-10
Regd. No. with Registrar of News Papers 10953/67

## అండర్ టేకింగ్ ।

మార్పుకు వ్యతిరేకంగా తూర్పుకు వ్యతిరేకంగా
తీర్పు చెప్పి ఒప్పుకొమ్మంటున్నావు నువ్వు
జైళ్ల పోరాటం నోళ్ళు మూయించగలిగితే
జైళ్లు మనసుకు దళ్లు కట్టగలిగితే
జైళ్ల రైళ్ళను నడిపించగలిగితే
పశ్చిమాన సూర్యుడు ఉదయిస్తే
పశ్చాత్తాపం ప్రకటిస్తాను, My Lord!

— వరవరరావు

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu', Printed at Ramesh Printers, Hyderabad, for Venkatramana Mudranalayam, Warangal, Working Editor Varavara Rao.